# Chandamama Press

VADAPALANI
MADRAS-26



OFFERS YOU...

FINEST PRINTING.-

Equipped with

PHOTO GRAVURE
KLIMSCH CAMERA
VARIO KLISCHOGRAPH-

-BLOCK MAKING

and a
host of Others....

# కాల్గేట్‌తో చెడ్డ శ్వాసను నిరోధించండి
# రోజంతా దంతక్షయం జరుగకుండా కాపాడుకొనండి!

ఎందుచేతనంటే: ఒక్కసారి తోముకుంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసనను మరియు దంత క్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి చెడ్డ శ్వాసను వెంటనే నిరోధించిందని మరియు భోజనం అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకొనుట వల్ల ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని, పూర్వము దంతశాస్త్ర చరిత్రలో ఎన్నడూ తెలియ జేయనంతగా శాస్త్ర పరిశోధనల వల్ల నిరూపించబడినది! ఒక్క కాల్గేట్ మాత్రమే దీనికి రుజువును కలిగివున్నది.

పిల్లలు కాల్గేట్‌తో క్రమంగా పళ్ళు తోముకునే అలవాటును తేలికగా అవలంబిస్తారు. ఎందుచేతనంటే ఎక్కువ సేపు నిలచే దాని పిప్పరమెంట్ లాంటి సువాసనంటే వారికి చాలా ఇష్టం.

శుభ్రత కొరకు, తాజా శ్వాసకొరకు మరియు పండ్లు తెల్లగా వుండుట కొరకు కాల్గేట్‌తో పండ్లను క్రమంగా తోముకొనండి.

మీకు పౌడర్ కావాలంటే, ఈ లాభములన్నింటినీ కాల్గేట్ టూత్ పౌడర్ ద్వారా పొందగలరు... ఒక్క డబ్బా నెలల తరబడి వస్తుంది...







...ప్రపంచములోని ఏ ఒక్క ఇతర డెంటల్ క్రీమ్‌కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు

DCG.35 TL

# చందమామ

## ఈ సంచికలో కథలు, వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.


అశోకా రిజిష్టర్డు
అమ్లా
బ్రిలియంటైన్







ఓ! అదా అది అశోకా అమ్లా బ్రిలియంటైన్ ప్రభావం
ఒక అందమే కాదు మెదడుకు చల్లగా హాయిగా వున్నది.
యిందు అమలక. బృంగ, వట్టివేరు, చందన. కేతకి. మొదలగు
మంచి ఓషధులు, అత్తరువులు చేరియున్నవి గాన
వేసవిలో చాల మేలు కలుగజేయును

విజయా కెమికల్సు మద్రాసు-7.



"నా క్రొత్త
యూనిఫారంలో
ఎలా ఉన్నాను"?

అందంగా ఉన్నావు,
మరి ఇది బిన్నీవారి

# కేస్‌మెంట్
# D 380 తో

తయారైంది.

D380 ఎంత అందంగా ఉంటుందో అంత బాగా మన్నుతుంది. స్కూలు పిల్లలు ప్రతినిత్యం వేసుకుతిరగడానికి తగినట్టుగా నేయబడింది.

అనేక రంగులలో మీకు కావలసినది తీయండి షర్టులకు బ్లౌజులకు గోల్డు స్టాండర్డ్ హైల్యాండ్, మాస్కాట్ పాప్లినులు వాడండి.

D380 ఫర్నిషింగ్ బట్టలకు కుషన్ కవర్లకు కూడా బాగా మన్నుతుంది.




ఈ సైను బోర్డును ప్రదర్శించే అనుమతింపబడిన స్టాకిస్టులవద్ద మీకు కావలసిన బిన్నీ బట్టలు కొనండి.

## బిన్నీ - బట్టలకు పెట్టినది పేరు

బెంగళూరు ఉలెన్ కాటన్ & శిల్క్ మిల్స్ కంపెనీ లిమిటెడ్ అగ్రహారం రోడ్డు, బెంగళూరు-23. బిన్నీ & కో లిమిటెడ్, మద్రాసువారి అంగ సంస్థ.

BM-4124

ఇంజనీరు కావాలని అతడు కలలు కంటున్నాడు. మీరు ఆ కలను నిజంచేయగలరా? పంజాబ్ నేషనల్ బ్యాంక్‌లో సేవింగ్స్ అక్కౌంట్‌ను ప్రారంభిస్తే మీరు దీనిని సాధించగలరు.

నేడే ఖాతా ప్రారంభించండి. నేటినుండియే అతనికోసం ఆదా చేయండి. రికరింగ్ డిపాజిట్ స్కీముకింద మీకు ఎంత లాభం చేకూరగలదో కూడా అడిగితెలుసుకోండి.

# పంజాబ్ నేషనల్ బ్యాంక్

PR-PNB-67/44-TEL



# యీ 'బ్రిజిల్' కొనల్ని భూత అద్దము క్రింద పోల్చి చూడండి



# బినాకా
## టూత్ బ్రష్

క్షేమకరమైన 'గుండ్రని బ్రిజిల్ కొనల'తోకూడి
REG. PAT. NO. 69453
చిగుళ్లను తెగనీయదు

## పరిశుభ్రముగా తోమండి
## క్షేమకరముగా తోమండి
## బినాకా తో తోమండి

C I B A

'CIBA 67/23 TEL

అన్నివంటలకు శ్రేష్ఠమైన
నూనెలు




అగ్‌మార్కు కాబడిన
ఏ.యస్. బ్రాండ్..
చాయపప్పు
నూనె




అగ్‌మార్కు కాబడిన
మేన్షన్ బ్రాండ్......
నువ్వులనూనె

- గోదావరిజిల్లా నువ్వులనుండి ఆరోగ్యకరమగు ప్రత్యేకపద్ధతులతో తయారుకాబడినవి.
- రుచి,రంగు,సువాసనలతో అన్నివంటపదార్థములను అమితమగు రుచివంతముగ చేయును.
- ఊరగాయలను చాలకాలము నిలువయుంచును. ముక్కను మెత్తబడనీయవు, బూజుపట్టనీయవు.
- తలకువాడినయెడల మెదడుకు చలువచేయును. వెంట్రుకలను బాగుగా పెరుగునట్లు చేయును.
- 16,4,2. కి.గ్రా. డబ్బాలలో పేకింగు చేయబడుచున్నవి.

ఏజెంట్సు :
శ్రీ మాజేటి వీరరాఘవయ్య,
కమీషను మర్చంటు,
శివాలయం వీధి, విజయవాడ

Ms. పెరుమాళ్ళు, & కో,
137, ఆదియప్పనాయక్ స్ట్రీట్,
మదరాసు

Ms. B. V. రావు & కో,
136, పురశువాకం హైరోడ్, మదరాసు

MFRS, అంబటిసుబ్బన్న&కో.




సోల్ సెల్లింగ్ ఏజంట్లు :—
ది బెంగాల్ ఎలక్ట్రికల్ కంపెనీ,
బెంగళూరు - 3, మదరాసు - 17



ఆంధ్ర:
జి. ఏ. పరశురాం కంపెనీ,
లకాడికా పూల్,
హైదరాబాదు - 1.



ఈ బట్టలన్నీ నిరాలా బారు సబ్బులో
కోసిన చిన్న ముక్కతో ఉతికినవే

Niralla

నిరాలా
బార్ సబ్బు
ఆదాయకరమైనది

తుంగభద్ర
ఇండస్ట్రీస్ లి.,
కర్నూలు

ASP.TIN 26 TEL.

# A GREAT NAME IN HANDLOOMS

## AMARJOTHI
FABRICS

BEDSPREADS
FURNISHINGS
& TOWELS

MFG: **AMARJOTHI FABRICS**
POST BOX NO 22 KARUR.

G.H.RAO



# జీవన్‌టోన్

రిజిస్టర్డు నంబరు 218726



శరీరంలోని కండరాలనూ రక్తకణాలనూ ఆయుర్వేద ఔషధాలు వృద్ధిచేయలేవా?—లేవు అని కొందరనుకుంటారు. ఇది నిరాధారమైన దురభిప్రాయం. దీన్ని తొలగించేదే జీవన్‌టోన్.

జీవన్‌టోన్: అద్భుతమైన టానిక్కు. శక్తివంతమైన ధాతుపుష్టిని, కండరాలను, రక్తకణాలను అతిత్వరితంగా వృద్ధిచేయుటవల్ల కొద్ది వారాల్లోనే మీ బరువు పెరుగుతుంది. బలిష్ఠంగా ఉన్నవారి శరీరసౌష్ఠవాన్ని ఇంకా పెంపొందిస్తుంది.

జీవన్‌టోన్ సేవనవల్ల బరువు తగుమాత్రం వృద్ధికాగానే పుచ్చుకోవటం మానివేయవచ్చు. ఇది శరీరంలో కండరాలతోపాటు కొవ్వుకూడా వృద్ధిచేస్తుంది కనుక, స్థూలకాయులు దీనిని సేవించకూడదు. ఎందుచేతనంటే—విపరీతమైన కొవ్వుతో శరీరం వికారంగా తయారవుతుంది. జీవన్‌టోన్ సేవిస్తున్నంత కాలమూ శరీర వ్యాయామం అత్యంత అవసరం. దీనివల్ల చక్కని ఆకృతి ఏర్పడుతుంది.

జీవన్‌టోన్ బాలింతలకు కల్పతరువువంటిది. ప్రసవించిన తరువాత పూర్వపు శక్తిని పుంజుకోవటంలో ఇది ఎంతగానో తోడ్పడుతుంది. దీనికి పథ్యం లేదు.

450 గ్రాం. వెల రు. 10-00 [ తపాలా ఖర్చులు రు. 3/- అదనం ]

జ్యోతి హాస్పిటల్ (ఫోన్ నం. 440206)

(బా. నం. 1413) 32, వి. ఎస్. రోడ్డు, మద్రాసు - 17

డాక్టర్ దామోదరన్, M.A.I.A.D.S(Regd)



తెల్లార్తే లత పుట్టినరోజు చాలామందికి
స్నేహితులకు ఆహ్వానాలు అప్పుడే
పంపడమైంది. కానీ పద్మకిప్పుడు
ఒకటే పెద్ద సమస్య!

వానాకాలం రోజులివి కట్టెలు తడిగా
వుండి మండవు ధరకూడా ఎక్కువే!



చింతిస్తూవున్న పద్మను చూసేందుకు వస్తుంది ఎదురింటి గీత

ఓడ మునిగిపోయినా
చెంపపైచేయిపెట్టుకోన
క్కరలేదే పద్మా!
నీకుఇప్పుడేం
విచారం?



ఒకటే విచారం గీతా!
వంటకు లభించేవి
తడి కట్టెలే! పైగా
ధరకూడా అధికం
ఏం చెయ్యాలో
బోధ పడటం లేదు!

ఓష్! ఇందుకేనా
యింత విచారం! చేతిలో
వెన్నపెట్టుకొని నెయ్యికై
వెదికినట్టుంది.
"లీకో" వుండగా
ఎందుకింత విచారం

నేను కూడా 'లీకో' గురించి
విన్నాను. కాని వాడి
చూడలేదు సుమా!



'లీకో' తక్కువ ధరకు లభిస్తుంది!
అతి పొదుపైనది. పొగలేక చక్కగా
మండుతుంది. అన్నిరకాల
బొగ్గు పొయ్యిలకు తగినట్టిది.
వంట కూడా త్వరగా ముగిస్తుంది.
రేపటి నుంచే 'లీకో'ని వాడి
చూడండి!



గీతా, ఇంద ఇంకొక గ్లాసు పాయసం నీ సలహాకి
చాలా కృతజ్ఞురాల్ని   నాకూ తృప్తి అందరికీ సంతోషం
ఇక ఎప్పుడూ 'లీకో' నే కొనాలని
తీర్మానించుకున్నా





LECO

# లీకో

నైవేలి లిగ్నైట్
కార్పొరేషన్, లిమిటెడ్,
నైవేలి-1.

FDS NLC 735 TE A

*FOR PRECISION IN...*



# Colour Printing

By Letterpress...

...Its B. N. K's., superb printing that makes all the difference. Its printing experience of over 30 years is at the back of this press superbly equipped with modern machineries and technicians of highest calibre.

**B. N. K.** ***PRESS PRIVATE LIMITED.***

***CHANDAMAMA BUILDINGS,***

***MADRAS-26***


BRP
ఇందిరారమణ పిక్చర్స్
సత్యమేజయం
నిర్మాత.
టీ.సి.సుబ్బన్న * 
దర్శకత్వం
పి.వి.రామారావు B.A
ఆంధ్రా.అరుణ. నైజాం.శ్రీలలితాపిక్చర్స్. సీడెడ్.పాలేశ్వర. మైసూరు.శ్రీనటరాజపిక్చర్స్




# అతనికి ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణను నేర్పండి

దూరప్రదేశాలనుగురించి తెలుసుకోవాలనుకుంటే మీ బిడ్డ మిమ్మల్నే అడుగుతాడు. మీ దగ్గర నుండి అనేక ముఖ్య విషయాలు నేర్చుకుంటాడు. అందులో ఒకటి ఫోర్‌హాన్స్‌తో సరియైన దంతసంరక్షణ. అది ఎట్లా తన పళ్ళను కాపాడుతుందో, ఎట్లా పంటిక్షయమును నివారిస్తుందో నేర్చుకుంటాడు.



ఒక దంతవైద్యునిచే నిర్మింపబడ్డ యీ టూత్ పేస్టులో బిగువైన పళ్ళకు ఇగుళ్ళకు కావలసిన ప్రత్యేక మందులున్నాయి. అవి మీకు, మీ బిడ్డకు మంచివి. అందుచేత, ఇప్పుడు ఇకముందు పళ్ళ జబ్బులు రాకుండ ఎట్లా కాపాడుకోవాలో అతనికి నేర్పించండి. ప్రతి ఉదయం, రాత్రి ఫోర్‌హాన్స్ వాడేటట్లు అతనిని ప్రోత్సహించండి. జీవితాంతం అవసరమైన దంతసంరక్షణ...ఇప్పుడే నేర్పించండి.

## జాగు చెయ్యక ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణ ఇప్పుడే నేర్పండి




ఉచితం: "పళ్లు ఇగుళ్ళను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అనే పుస్తకం. రంగుచిత్రాలలోనున్న ఈ పుస్తకం అనేక విషయాలను తెలుపుతుంది. పది భాషల్లో దొరుకుతుంది. (తపాలా ఖర్చుకు) 10 పై. బిళ్ళలు పంపండి. అడ్రసు: మానర్స్ డెంటల్ అడ్వైజరీ బ్యూరో, పోస్టు బ్యాగు నం. 10031, బొంబాయి.1.

పేరు..........................................................

అడ్రసు..........................................................

* మీకు కావలసిన భాష క్రింద గీతపెట్టండి: తెలుగు, ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలీ, అరవం, మలయాళం, కన్నడ.

ఈ పుస్తకం అతడు చదివే పుస్తకాలలో కెల్ల ముఖ్యమైనది కావచ్చు

**ఫోర్‌హాన్స్ టూత్ పేస్టు—ఒక దంతవైద్యుడు నిర్మించినది**

"C. 1" CMGM-18 B TL



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఏకాలంలో నైనా శాసనాలు చేసే అధి కారం కొద్ది మందికే ఉంటుంది. పూర్వ కాలం రాజూ, అతని మంత్రులూ కలిసి శాసనాలు చేసేవారు. శాసనాలు ఎవరు చేసినప్పటికీ అవి ప్రజల జీవితానికి సుఖం పెంపు చేసేవిగా ఉండాలి. ఈ నీతిని మనం "తలపాగా శాసనం" అన్న హాస్యకథలో చూస్తాం.

ఈ సంచికలో ప్రచురితమైన "శక్తి మంతులు" [భేతాళకథ]కు ఆధారం శ్రీమతి చీమకుర్తి మహలక్ష్మమ్మ పంపిన కథ.

సంపుటి 42 ఆగస్టు '67 సంచిక 2

CHITRA



# భారత చరిత్ర



నవాబు చేత దెబ్బతిన్న ఇంగ్లీషువారు తమ పరిస్థితి అనుకూల పరచుకోవటానికి ఎత్తులు సాగించారు. వారికి బెంగాలులోని రాజకీయ పరిస్థితి బాగా తెలుసు. వారు కలకత్తా నుంచి ఫుల్టా చేరి, నవాబు శత్రు వర్గాలతో రాయబారాలు సాగించారు. కలకత్తాకు అధికారిగా సిరాజుద్దౌలా చేత నియమించబడిన మానిక్‌చాంద్, ఓమిచాంద్, జగత్‌సేఠ్ లాటి కోటీశ్వరులూ ఇంగ్లీషువారికి "అమ్ముడు" పోయారు; ఈ కోటీశ్వరులకు నవాబు దర్బారులో చాలా పలుకుబడి ఉన్నది. ఈ విధంగా ఇంగ్లీషువారు నవాబు కింద గోతులు తవ్వుతూనే, తమ వ్యాపారం గురించి నవాబుకు విజ్ఞాపన పత్రాలు అందజేస్తూవచ్చారు.

కలకత్తా నవాబు ఆక్రమణలోకి పోయిందని తెలియగానే మద్రాసులోని ఇంగ్లీషువారు కలకత్తాకు సేనలను పంప నిశ్చయించారు. ఫ్రెంచివారితో యుద్ధానికిగాను సాయుధసైనిక, నౌకాబలాలు అయత్తమై ఉండనే ఉన్నాయి. క్లైవ్, అడ్మిరల్ వాట్సన్‌ల నాయకత్వాన ఈ రెండు బలాలనూ అక్కడికి పంపటానికి నిర్ణయం జరిగింది. డిసెంబరు 14న ఈ బలాలు బెంగాలు చేరాయి.

నవాబుకు ఈ యుద్ధసన్నాహం గురించి ఏమీ తెలీదు. ఫుల్టన్ లోని బ్రిటిషువారు అతని వద్ద ఇంకా ప్రార్థనలు చేస్తూనే ఉన్నారు. వారికి అమ్ముడు పోయిన దర్బారు ప్రముఖులు నవాబుతో, "పాపం, వ్యాపారం చేసుకు నేవాళ్ళు!" అని వారి పక్షాన మాట్లాడుతూనే ఉన్నారు.

ఇంగ్లీషు కంపెనీకి లోగడ ఉండిన హక్కులను అమలులోకి రానివ్వటమే గాక, నష్టపరిహారం కూడా చెల్లించవలసిందని వాట్సన్ 17 డిసెంబరున నవాబుకు ఉత్తరం

## 71. సిరాజుద్దౌలా పై కుట్ర

రాశాడు. క్లైవు కలకత్తా మీదికి దండెత్తాడు. కలకత్తాకు అధిపతిగా ఉండిన మానిక్ చాంద్ యుద్ధ ప్రయత్నాలు చేస్తున్నట్టు అభినయిస్తూ ముర్షిదాబాదుకు పారిపోయాడు. చెప్పుకోదగిన యుద్ధమేమీ జరగకుండానే కలకత్తా 1757 జనవరి 2 న క్లైవు వశమయింది. ఇంగ్లీషువారు కలకత్తాలోని అనేక గొప్ప భవనాలను ధ్వంసం చేసి, హుగ్లీని కొల్ల గొట్టారు.

ఇంత జరిగినా సిరాజుద్దౌలా కలకత్తాకు వచ్చి, ఫిబ్రవరి 9 న "అలీనగర్ సంధి" ద్వారా ఇంగ్లీషువారు అడిగినదంతా ఇచ్చేశాడు. తన కిందివాళ్ళలో విశ్వాసం నశించో, మరే కారణం చేతనో నవాబుకు ఇంగ్లీషు వారితో పేచీలు పెట్టుకో వద్దనిపించింది.

ఈ సమయంలోనే యూరపులో "ఏడేళ్ల యుద్ధం" రావటమూ, భారత దేశంలోని ఫ్రెంచి, ఇంగ్లీషువారి మధ్య యుద్ధాలకు అవకాశం ఏర్పడటమూ జరిగింది. ఫ్రెంచి వారి కింద ఉన్న చంద్రనగరును ఇంగ్లీషు వారు జయించ గోరారు. అయితే సిరాజుద్దౌలా ఇందుకు ఆక్షేపణ తెలిపి, అలీనగరు సంధి నిబంధనలకు అది విరుద్ధమన్నాడు. ఆయన తన రాజ్యంలోని ఫ్రెంచివారిని కాపాడాలన్న నిశ్చయం ప్రకటించాడు గాని,



అందుకు తగిన చర్య లేవీ తీసుకోలేదు. మార్చి 1757 లో క్లైవు వాట్సనులు చంద్రనగరును సులువుగా జయించారు. హుగ్లీలోని ఫౌజ్‌దారయిన నందకుమార్ అనే వాడు తన కింద ఉన్న పెద్ద సేనను దూరంగా తీసుకు పోకపోతే ఇంగ్లీషువారు చంద్రనగరును గెలిచి ఉండక పోదురు. నందకుమారుడు ఇంగ్లీషువారి వద్ద లంచం పుచ్చుకుని ఉండవచ్చు. కాని నవాబు నందకుమారుకు ఇంగ్లీషువారిని నిరోధించమని ఉత్తరువు పంపలేదు.

పారిపోయి వచ్చిన ఫ్రెంచివారికి నవాబు తన దర్బారులో రక్షణ ఇచ్చాడు. ఇంగ్లీషు

వారు ఎన్ని ఆశలు చూపినా అతను ఫ్రెంచి శరణార్థులను వెళ్ళగొట్టలేదు. తాము ఫ్రెంచివారితో యుద్ధం సాగిస్తూ ఉండగా బెంగాలు నవాబు ఫ్రెంచివారి పట్ల సానుభూతి కలిగి ఉండటం తమకు క్షేమం కాదని ఇంగ్లీషువారు గ్రహించారు. అందుచేత వారు సిరాజుద్దౌలాను గద్దె దించి, మరొకణ్ణి ఆ స్థానంలో ఉంచ నిశ్చయించారు. కుట్ర జరిగింది. ఈ కుట్రలో మీర్ జాఫర్, రాయ్ దుర్లభ్—ఈ ఇద్దరూ నవాబు కింద సేనాపతులే—జగత్ సేఠ్ అనే కోటీశ్వరుడూ చేరారు. కానున్న నవాబు మీర్ జాఫర్. జూన్ 10 న కుట్రదారులకూ ఇంగ్లీవారికీ ఒక ఒప్పందం జరిగింది; ఇంగ్లీషువారు సైనిక సహాయం చేస్తారు, అందుకుగాను కుట్రదారులు ఇంగ్లీషు కంపెనీకీ, దాని అధికారులకూ ప్రతిఫలం ముట్టచెబుతారు. ఓమిచాంద్ అనేవాడు కొల్లగొట్టిన సొత్తులో పెద్ద వాటా అడిగాడు. క్లైవు ఒప్పందానికి మాయనకలు ఒకటి తయారుచేసి, అందులో ఓమిచాంద్ కోరిన విధంగా ఒక క్లాజు చేర్చాడు. దీనిపై వాట్సన్ సంతకం చేయ నిరాకరించగా, క్లైవు అతని సంతకాన్ని ఫోర్జరీ చేయించాడు.

ఫ్రెంచివారిని వెనక వేసుకుని ఇంగ్లీషువారి శత్రుత్వం సంపాదించుకున్న సిరాజుద్దౌలా, చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టుగా, ద్రోహులైన తన అధికారుల సలహా పాటించి ఫ్రెంచివారిని తన ఆస్థానం నుంచి పంపెయ్య నిశ్చయించాడు. వాళ్ళు వెళ్లిపోతూ, నవాబు పైన కుట్ర జరుగుతున్నదని హెచ్చరించారు. ఈ కుట్ర గురించి నవాబుకు తప్ప అందరికీ తెలుసు. అప్పుడైనా నవాబు మీర్ జాఫర్‌ను బంధించినట్టయితే మిగిలిన కుట్రదారులకు హడలు పుట్టి ఉండేది. అతను మీర్ జాఫర్ చేసిన ప్రమాణాలు నమ్మి, అతన్ని సేనాపతిగా ఉంచుకుని యుద్ధయత్నాలు ఆరంభించాడు!






# గౌరీ చంద్రులు

ఒక ఊళ్లో స్థితిపరుడైన రైతుకు ఒక చక్కని కొడుకు పుట్టాడు. వాడికి చంద్రన్న అని పేరు పెట్టుకున్నారు. అయితే వాడు పెరుగుతున్న కొద్దీ విచిత్రంగా తయారవుతూ వచ్చాడు. వాడి మాటలు అయోమయంగా ఉండేవి. ఏళ్లు మీద పడుతున్న కొద్దీ వాడి "పిచ్చి వాగుడు" హెచ్చింది.

ఒకరోజు వాడి తండ్రి వాణ్ణి మందలిస్తూ, "అలా మాట్లాడతా వేమిటిరా? అందరి లాగా మాట్లాడలేవూ? ఇలా అయితే నీకెవరు పిల్ల నిస్తారు?" అన్నాడు.

"చూడు, నాన్నా, అగ్గి పాయిలో ఉన్నా కూడా పైకే పోతుంది. నీరు ఎత్తున ఉన్నా కిందికే పారుతుంది," అన్నాడు చంద్రుడు.

"ఛీ, వెధవా! నే నొకటి చెబితే నువ్వొకటి చెబుతావు. నేను పోయిన తరవాత నీ గతి ఏమవుతుంది?" అన్నాడు తండ్రి.

"నేనూ పా య్యే వా ణ్ణే గా? ముందు పుట్టావు గనక నువు ముందు పోతావు," అన్నాడు చంద్రుడు.

తండ్రికి కోపం వచ్చి వాణ్ణి ఇంటి నుంచి వెళ్ళి పొమ్మన్నాడు. చంద్రుడు బట్టలు వేసుకుని, చెప్పులు తొడుక్కుని, గొడుగు తీసుకుని బయలుదేరాడు.

చంద్రన్న వెళ్లి వెళ్లి మధ్యాన్నానికి ఒక చెరువుగట్టు చేరాడు. అక్కడికి నాగేశ్వరు డనే పెద్దమనిషి వచ్చి, తాను తెచ్చిన ఆహారంమూట విప్పుతూ, చంద్రుణ్ణి చూసి, "ఎవరు నువు? ఎక్కడికి పోతున్నావు?" అని అడిగాడు.

"నే నొక అనాధుణ్ణి. నా కాళ్ళెక్కడికి తీసుకుపోతే అక్కడికి పోతాను," అన్నాడు చంద్రుడు.

"అలా అయితే మా యింటికి వచ్చి, పని చేస్తూ ఉండు," అంటూ నాగేశ్వరుడు తన

వి. సీతారామయ్య




మూటలోని ఆహారం కొంత చంద్రుడికి పెట్టి, మిగతాది తాను తిన్నాడు.

తరవాత ఇద్దరూ ఆ మాటా యీ మాటా మాట్లాడుకుంటూ నడవసాగారు.

ఒక అడవి వచ్చింది. చంద్రుడు గొడుగు విప్పి, ఎత్తి పట్టుకుని నడవటం చూసి, నాగేశ్వరుడు; "నీడగా ఉన్నది గదా. గొడుగు ఎత్తావేం?" అన్నాడు.

"గొడుగు వేసుకోమని నా తల చెప్పింది," అన్నాడు చంద్రుడు.

కొంతదూరం వెళ్ళాక ఒక వాగు తగిలింది. నాగేశ్వరుడు చెప్పులు తీసి చేత పట్టుకుని వాగు దాటుతూంటే చంద్రుడు చెప్పులతోనే దిగాడు. అదేమిటంటే కాళ్ళు చెప్పాయన్నాడు.

మరి కొంతదూరం పోయాక చంద్రుడు, "ఈ దారికి నిచ్చెన కూడా ఉంటే ఎంత బాగుండును!" అన్నాడు.

"దారికి నిచ్చె నేమిటిరా, పిచ్చివాడా?" అన్నాడు నాగేశ్వరుడు.

ఈ విధంగా మాట్లాడుకుంటూ వాళ్ళు నాగేశ్వరుడి ఊరు చేరుకున్నారు. నాగేశ్వరుడు తన ఇంటి తలుపు తట్టి, "గౌరీ," అని పిలిస్తే ఒక పిల్ల వచ్చి తలుపు తెరిచి, నాగేశ్వరుడికి చెంబుతో నీళ్లిచ్చి, మరొక మనిషి ఉండటం చూసి మరొక చెంబుతో నీళ్లు తెచ్చి చంద్రన్నకిచ్చి మళ్లీ వెళ్లిపోయింది.

"ఇది కొత్త చెంబా, వాడకంలో ఉంటున్న చెంబా?" అని చంద్రు డడిగాడు.

"ఏమి టా పిచ్చి ప్రశ్న?" అన్నాడు నాగేశ్వరుడు కోపంగా.

ఆయన చంద్రుణ్ణి వసారాలో కూర్చోమని, లోపలికి వెళ్లి భార్యతో తాను వెళ్ళిన పని కాలేదని చెప్పాడు. గౌరి వంటింట్లో వంట చేస్తున్నది.

నాగేశ్వరుడు వెళ్లిన పని గౌరికి సంబంధం చూడటం. దూరాన ఒక సంబంధం ఉన్నదంటే వెళ్ళాడు, కాని వెళ్లిన పని సాను

కూలం కాలేదు. ఆ సంబంధం ఆయనకు నచ్చలేదు. మరేదైనా సంబంధం చూడాలి. ఆయన తన భార్యకు చంద్రుణ్ణి గురించి చెబుతూ, "ఎవడో అనాధ. అమ్మాయి పెళ్లి జరిగినదాకా చేతి సహాయం ఉంటాడు గదా అని వెంట పెట్టుకొస్తే వాడు వెర్రి బాగులవాడిలా గున్నాడు," అన్నాడు.

ఇంతలో వంట అయింది. గౌరి తన తండ్రినీ, అతిథినీ భోజనానికి పిలిచింది. ఆమె మామూలు భోజనంతో బాటు ఒకటి రెండు పిండి వంటలు కూడా చేసింది.

భోజనాలయాక నాగేశ్వరుడు చంద్రన్నతో సహా వసారాలోకి వచ్చి కూర్చుని, "ఎలా ఉంది భోజనం?" అన్నాడు.

"నా బతుకల్లేనే ఉంది," అన్నాడు చంద్రుడు.

ఈ మాట గౌరికి వినిపించింది. ఆమె గబగబా దొడ్డి దారిన పొరుగింటికి వెళ్లింది. నాగేశ్వరుడికి మాత్రం చంద్రుడి మాటకు కోపం వచ్చి, "ఇక నువు దయచెయ్యి. ఈ ఇంట నీకు చోటు లేదు," అన్నాడు.

"ఋణం మిగిలి ఉంటే మీరే తీర్చు తారు," అంటూ చంద్రన్న లేచి, చెప్పులు తొడుక్కుని, గొడుగు చంకన పెట్టుకుని బయలుదేరారు.




త్వరలోనే గౌరి ఒక పళ్లెంలో తాంబూలం పట్టుకొచ్చి, "ఆయన ఎక్కడ?" అని తండ్రి నడిగింది.

"దొంగ వెధవ! వెళ్లి పొమ్మన్నాను!" అంటూ తండ్రి చంద్రుడన్న మాట చెప్పాడు.

"ఆ మాటకేనా? నేనూ విన్నాను. అందులో తప్పేముంది? తాంబూలం లేని భోజనం చచ్చు భోజనం కాదా? అందు కనే పక్క ఇంటికి పోయి తాంబూలం తెచ్చాను," అన్నది గౌరి.

"పోతూ పోతూ వాడు పొగరుగా ఏమన్నాడో తెలుసా? ఋణం మిగిలి ఉంటే మనమే తీరుస్తామట!" అన్నాడు తండ్రి.

"ఏ నాటి ఋణమో ఉండబట్టేగా, దారే పొయ్యేవాణ్ణి పిలిచి అన్నం పెట్టాం?" అన్నది గౌరి.

"నీకు తెలీదు లేవే! వాడు దారి పొడుగునా ఇంకా చాలా పిచ్చిమాటలు మాట్లాడాడు," అంటూ నాగేశ్వరుడు కూతురితో జరిగినదంతా చెప్పాడు.

అంతా విని గౌరి, "అవి నీకర్థం కాలేదుగాని, పిచ్చిమాటలు కావు, నాన్నా," అంటూ అన్నిటికీ అర్థం చెప్పింది. కొత్త చెంబా, వాడకంలో ఉన్న చెంబా అనటంలో అతని ఉద్దేశం గౌరికి పెళ్ళయిందా, కాలేదా అని. దారికి నిచ్చెన ఉంటే బాగుంటుందంటే ఏవన్నా కథలు చెప్పుకుంటూ నడిస్తే బాగుంటుందని. అతను చెప్పులతో వాగులోకి దిగింది కాళ్ళలో నీటి అడుగున ఉండే ముళ్ళూ, రాళ్ళూ గుచ్చుకోకుండా; అడవిలో గొడుగు వేసుకున్నది, పైనుంచి ఏదీ మీద పడకుండా.

గౌరి చంద్రన్నను తిరిగి పిలిపించ నిశ్చయించింది. ఆమె తమ పనిదాన్ని పిలిచి, "నువు వెంటనే రచ్చబండ దగ్గరికి వెళ్ళి, అక్కడి దుకాణంవాణ్ణి ఒక అణా పటపటలూ, ఒక అణా చిటచిటలూ ఇయ్యమను. నువ్వడిగే దేమిటో కొట్టువాడికి ఎవడు చెబుతాడో వాణ్ణి పేరడుగు. పేరు చంద్రుడని అతను చెబితే వెంటబెట్టుకురా," అన్నది. పనిమనిషి కొట్టు దగ్గిరికి వెళ్ళి, "ఒక అణా పటపటలూ, ఒక అణా చిటచిటలూ ఇయ్యి," అన్నది.

"అవేమిటి? సరిగా చెప్పు," అన్నాడు కొట్టువాడు.

"ఒక అణా అవాలూ, ఒక అణా వేరుశనక్కాయలూ కావాలిటయ్యా!" అన్నాడు అక్కడే ఉన్న చంద్రుడు. పనిమనిషి అతని పేరడిగి, వెంట తీసుకు వచ్చింది. గౌరికి అతని మీద మనస్సు నిలిచిందని తెలిసి, నాగేశ్వరుడు వారిద్దరికీ పెళ్ళి చేసేశాడు.





# పాతాళదుర్గం

## 16

[ ధూమకుడూ వాళ్ళు, రాక్షసుల కనుగప్పి కొండల కేసి పరిగెత్తారు. అక్కడ వారి కొక జలపాతం కనిపించింది. సోమకుడు దాహం తీర్చుకునేందుకు పోగానే, నీటి ధార కట్టుబడిపోయి, అక్కడ నిలువెత్తు ద్వారం కంటబడింది. వాళ్ళు దాన్ని సమీపించగానే అది తెరుచుకున్నది. లోపల అగ్నిజ్వాలలు లేస్తున్నవి. తరవాత—]

గుహలోని అగ్నిజ్వాలలను చూస్తూనే, ధూమకుడు ద్వారం వద్ద ఆగిపోయాడు. సోమకుడూ, విరూపుడూ తమతమ ఆయుధాలను చేతికి తీసుకున్నారు. విరూపుడి భుజం మీద వున్న నల్లగరుడపక్షి రెక్కలు తపతపలాడిస్తూ ఎగిరిపోయేందుకు ప్రయత్నించింది.

"కాలశంబర మాంత్రికదొర ఎక్కడ? జలపాతం మంత్రించినట్టు కట్టుబడిపోయిందేం? ఈ మంటలేమిటి? ఇందులో ఏమన్నా మోసం లేదు కదా?" అంటూ విరూపుడు ఒకడుగు ముందుకు వేసి, ధూమకుడి భుజం మీదుగా గుహ లోపలికి తొంగిచూశాడు.

"ఎవరది! ఆటవికనాయకుడు విరూపుడా?" అన్న ప్రశ్నతోపాటు, జ్వాలల వెనక కాలశంబర మాంత్రికుడి రూపం ప్రత్యక్షమయింది.





కాలశంబర మాంత్రికుడితో స్నేహం కలపటానికి యిదే మంచి తరుణం అనిపించింది, ధూమకుడికి. అతడు ముందు కొక అడుగువేసి మాంత్రికుడికి నమస్కరిస్తూ, "మహామాంత్రికా! ఆ కొండ ప్రాంతంలో చీకటిమాటున ఎవరెవరో తెలియని స్థితిలో పెద్ద పొరపాటు జరిగిపోయింది. అందుకు నా తరఫునా, నా అనుచరుడు సోమకుడి తరఫునా క్షమాపణ కోరుతున్నాను. ఇదుగో, మీ మంత్రదండం! దీని సహాయంతోనే, ఎన్నో ఆపదలు గడిచి మేమిక్కడికి రాగలిగాం," అన్నాడు.

కాలశంబర మాంత్రికుడు మంత్రదండాన్ని అందుకుని, కళ్ళ కద్దుకుని, "గతాన్నంతా మరిచిపోదాం. ఇప్పుడు జరగవలసిన కర్మకాండ చాలా వున్నది. మీరు గుహలోకి వచ్చేయండి," అన్నాడు.

ధూమకుడూ వాళ్ళు గుహలోకి అడుగు పెట్టారు. ఆ వెంటనే గుహద్వారాన్ని రాతి పలక మూసేసింది. తిరిగి ఎప్పటిలాగా జలపాతం పెద్ద ధ్వనితో ద్వారాన్ని కప్పివేస్తూ ప్రవహించ సాగింది. మాంత్రికుడు అగ్ని జ్వాలలున్న గుహ నుంచి మరొక గుహలోకి దారి తీశాడు. అక్కడ పై నుంచి వెలుగు బాగా ప్రసరిస్తున్నది. ఆ గుహలో నుంచి

విరూపుడు రెండు చేతులూ ఎత్తి మాంత్రికుడికి నమస్కరిస్తూ గుహద్వారం దగ్గిరే సాగిలపడ్డాడు.

మాంత్రికుడు చిరునవ్వు నవ్వి ద్వారం దగ్గిరకు వచ్చి, విరూపుణ్ణి దీవిస్తున్నట్టు చేఎత్తి, "ఈ యిద్దరూ ఎవరు?" అని ఆశ్చర్యపడుతున్నవాడిలా ప్రశ్నించి, విరూపుడు లేచి జవాబిచ్చేంతలో, "మీరు కదంబదేశవారులు కదా? మీ రాజు ఉగ్రసేనుడు ఎలా వున్నాడు? మీ రాజ్య సరిహద్దుల్లోని కొండ దగ్గిర అంత గురిగా నా ముంజేతిలో బాణం కొట్టిన వాళ్ళెవరు, మీ యిద్దర్లో?" అని ప్రశ్నించాడు.



ఏటవాలుగా భూగర్భంలోకి ఒక దారి వున్నది. దాని వెంట మాంత్రికుడు ధూమ కుడూ వాళ్ళను దిగువకు తీసుకుపోయాడు.

అక్కడ నేల సమతలంగా వున్నది. మనుషులు నివసించటానికి అనువుగా, కొండరాతిలో కొన్ని గదులు ఏర్పాటు చేయ బడినై. వాటి ముందున్న ఆవరణలో కొందరు రకరకాల పరికరాలతో పనులు చేస్తున్నారు. పెద్దపెద్ద రోళ్ళల్లో కొందరు ఆకులూ, చెట్లవేళ్ళూ వేసి రోకళ్ళతో దంచు తున్నారు. మరికొందరు ఆ దంచిన దిను సుల్ని పోగుచేసి తెచ్చి చాపల మీద ఆరబెడుతున్నారు.

కాలశంబర మాంత్రికుడు వెనుదిరిగి తన వెంట వున్నవాళ్ళ కేసి చిరునవ్వు నవ్వుతూ చూసి, "ఇదంతా ఏమిటని మీకు ఆశ్చర్యం కలుగుతున్నది గదా ?" అని అడిగాడు. అవునన్నట్టు ధూమకుడు తలా డించాడు.

"ఈ పనులు చేసేవాళ్ళంతా కుంతల దేశ మంత్రి గంగాధరుడు పంపినవాళ్ళు. వీళ్ళ నాయకుడు భద్రుడు మరికొందరితో కలిసి కొండ పైకి వెళ్ళాడు. యిప్పుడు మనం వున్నది, కొండగర్భం. మహాకలి రాక్షసుడిది పాతాళదుర్గం అయితే, మనది



కొండగర్భదుర్గం. ఆ దుర్మార్గుణ్ణి దుర్గంతో పాటు సర్వనాశనం చేయటానికి ఏర్పాట్లు పూర్తి అవుతున్నవి," అన్నాడు కాలశంబర మాంత్రికుడు.

"భద్రుడు మీరున్న చోటుకు ఎలా రాగలిగాడు ?" అని ప్రశ్నించాడు ధూమ కుడు ఎంతో ఆశ్చర్యపడుతూ.

"ఇక్కడి కతను చుట్టుదారిన వచ్చాడు, మీరు నానాకష్టాలూ పడి దగ్గిర దారిన వచ్చారు. మీకు అరణ్యంలో విరూ పుడి ఆటవికులు సహాయం చేసినట్టే, అతడికి మరికొందరు సహాయపడారు," అన్నాడు కాలశంబరుడు.



"ఈ ఓషధులన్నీ ఏమిటి కాలశంబర దొరా?" అని అడిగాడు విరూపుడు.

"రాక్షససంహారానికి ఉపయోగించే ఆయుధాల్లో యివి ముఖ్యమైనవి. నువ్వాట వికుడివి కదా? ఒక్కొక్క ఆకులో, ఒక్కొక్క వేరులో ఎంతటి ప్రాణదాన దహన శక్తులుంటవో నీకు తెలియంది కాదు," అన్నాడు మాంత్రికుడు.

అప్పటివరకూ ఒక ప్రశ్న అడుగుదామని ఉగ్గబట్టుకూర్చున్న ధూమకుడు, మాంత్రికుణ్ణి, "మహామాంత్రికా! రాకుమారి కాంతిసేన క్షేమమా?" అని అడిగాడు.



"క్షేమమే. మంత్రి గంగాధరుడి కొడుకు శశికాంతుడి క్షేమసమాచారాలడగవేం? అతడి గాయాలకు మందు మంత్రాలు ప్రయోగించి నయం చేశాను. కాని, అరణ్యంలో, గూడేల పైకి మనుషుల వేటకై వచ్చిన రాక్షసబంట్ల చేతిలో అతడు చిక్కిపోయాడు, నేను తప్పించుకో గలిగాను. అతడిప్పుడు కాంతిసేనతో పాటు మహాకలిరాక్షసుడి చెరలో వున్నాడు. చెరలో వున్న ఆ యిద్దరూ ఒకర్నొకరు గాఢంగా ప్రేమించుకున్నారట...యిదేదో నా కేమాత్రం అర్థంకాని సంగతనుకో..." అంటూ మాంత్రికుడు, విరూపుడి కేసి తలతిప్పి కనుబొమలు ఎగరవేశాడు.

ఒక క్షణకాలం నిశ్శబ్దం. మహాకలిని హత మార్చటానికి మాంత్రికుడు వేసిన పథకం ఏమిటో ధూమకుడికి అంతు పట్ట లేదు. అతడి దృష్టిలో అందుకు రెండే రెండు మార్గాలున్నవి. ఒకటి: పెద్ద సైన్యంతో వచ్చి అతణ్ణి యుద్ధంలో ఓడించటం. రెండు: ఏదో కుతంత్రంపన్ని అతన్ని ఒంటరిగా దొరక పుచ్చుకుని హతమార్చటం.

ధూమకు డిలా ఆలోచించి మాంత్రికుణ్ణి ఏదో అడగబోయేంతలో, కొండ పైకి







పోయేందుకున్న మెట్లమీంచి యిద్దరు యువకులు కుప్పించి దూకుతూ అక్కడికి వచ్చారు. ఇద్దరూ జంతుచర్మాలు ధరించి వున్నారు. నడుం నుంచి పొడవాటి కత్తులు వేల్లాడుతున్నవి.

వాళ్ళు ధూమకుడూ అతడి అనుచరుల్ని చూస్తూనే, ఎవరు వీళ్ళు? అన్నట్టుగా మాంత్రికుడి కేసి చూశారు. మాంత్రికుడు తల పంకిస్తూ, "భద్రా! నీవు చెప్పదలిచిందేదో చెప్పవచ్చు. వీళ్ళు మన మిత్రులే, కదంబదేశపౌరులు. రాకుమారి కాంతిసేన రక్షణకై వచ్చారు," అన్నాడు.

"రాకుమారి రక్షణ రాక్షసులే చూస్తున్నారు. మనం రక్షించవలసింది శశికాంతుణ్ణి. వాళ్ళు మహాకలి రాక్షసుడి తండ్రి శతవర్ధంతికి ఏర్పాట్లన్నీ పూర్తి చేస్తున్నారు. రేపు మధ్యాహ్నం ఒంటి గంట వేళ ఆ తంతు ప్రారంభమవుతుంది, శశికాంతుడి శిరశ్ఛేదంతో అది ముగుస్తుంది," అన్నాడు భద్రుడు.

"నా తండ్రిని చంపినంత తేలిగ్గా మహాకలి శశికాంతుణ్ణి చంపలేడు. రేపు సూర్యాస్తమయం లోపల దండకారణ్యంలో రాక్షస కీటకం అనేది లేకుండా చేయబోతున్నాను. నా తండ్రి హత్యకు ప్రతీకారం చేసి తీరుతాను. పదండి, ఆ దుర్మార్గుడి ప్రయత్నాలేమిటో నేనూ స్వయంగా చూస్తాను," అంటూ కాలశంబర మాంత్రికుడు కాళ్ళతో నేలను గట్టిగా తాటించి, పళ్ళు కొరుకుతూ బయలుదేరాడు.

కొండగర్భంలో వున్న రహస్యమార్గాల వెంట ఒక అర గంట కాలం నడిచి అందరూ ఒక శిఖరప్రాంతాన్ని చేరారు. ఆ శిఖరం మీద మహావృక్షా లెన్నో వున్నవి. వాటి నిండా అల్లిబిల్లిగా అడవితీగలు అల్లుకుని వున్నవి. మాంత్రికుడు నిశ్శబ్దంగా ముందుకుపోయి గుబురుగా వున్న ఒక చెట్టు ఆకులను మెల్లిగా పక్కలకు తొలి




31





గించి దిగువకు చూశాడు. అతడికి పాతాళ దుర్గం, అందులోని భవనాలూ, వాటి ముందున్న మైదానప్రదేశం, అందులో వంటలూ వార్పులకూ, వినోదాలకూ రాక్షసులు చేస్తున్న ఏర్పాట్లూ కనిపించినై.

కాలశంబర మాంత్రికుడు కొంచెంసేపు కన్నార్పకుండా వాటి కేసి చూసి, తరవాత తలతిప్పి, ధూమకుడూ అతడి అనుచరుల్నీ దగ్గిరకు రావలసిందిగా సంజ్ఞ చేశాడు. వాళ్ళు నిశ్శబ్దంగా అతడి దగ్గిరకు వెళ్ళారు. మాంత్రికుడు వాళ్ళకు పాతాళ దుర్గం చూపించాడు. ఆ దుర్గం మీద సూటిగా సూర్యకాంతి ప్రసరించటం లేదు. కాని ఏదో చీకటి వెలుగూ కాని సంధ్యా కాంతిలాంటిది ఆ దుర్గ ప్రదేశాన్నంతా ఆవరించి వున్నది.

"అదా పాతాళదుర్గం! యిక్కడా ఆ క్రూరుడు మహాకలి నివశించేది!" అన్నాడు ధూమకుడు.

"అవును. కాని రేపు సూర్యాస్తమయంతో వాడి దుర్గం, వాడూ కూడా మట్టిలో కలిసిపోతారు, నా తండ్రి ఆత్మకు శాంతి కలుగుతుంది. ఇంతకాలంగా ఈ కార్యం ఒంటరిగానే సాధించాలన్న మూర్ఖపు పట్టుదలలో వుండిపోయాను. ఎంత గొప్ప మాంత్రికుడి కయినా అది సాధ్యంకాని పని. కేవలం మంత్రంతో అయేది కాదు, తంత్రం కూడా ప్రయోగించాలి. అందుకు భద్రుడు నా కెంతగానో తోడ్పడ్డాడు," అన్నాడు కాలశంబర మాంత్రికుడు.

ఆ తరవాత అందరూ అక్కణ్ణించి వెనుదిరిగారు. మాంత్రికుడు ముందుండి దారి తీస్తూ, లోగడ వచ్చిన మార్గాన కాకుండా మరోదారిన నడవసాగాడు. ఓపావు గంట అలా నడిచి అతడు ఒక పెద్ద చెట్టుబోదెను సమీపించి, దాని మీద గుప్పెటతో బలంగా నొక్కాడు. చెట్టుబోదెలో మనిషి దూరి అవ

తలికి పోవటానికి వీలయినంత పెద్ద కంత ఏర్పడింది.

మాంత్రికుడు ఆ కంతలో నుంచి అవతలికి చూసి, ధూమకుడూ వాళ్ళను దగ్గిరకు రమ్మని పిలిచాడు. ధూమకుడు ఆ కంతలోంచి చూస్తూనే అదిరిపడ్డాడు. అతడికి కలలో కూడా ఊహించని ఒక వింత దృశ్యం కళ్ళబడింది.

అది ఒక పెద్ద సరోవరం. దాని ఒడ్డున్న ఒక చెట్టు కింద కుంభీరుడు కూర్చుని వున్నాడు. అతడికి అల్లంత దూరంలో రాజకుమారి కాంతిసేన, మరొక భిల్లస్త్రీతో కలిసి సరోవరతీరం వెంట విహరిస్తున్నది.

"కాంతిసేన! కాంతిసేన!" అంటూ ధూమకుడు పెద్దగా కేకపెట్టబోయి తమాయించుకున్నాడు. అతడు కాలశంబరుడికేసి తిరిగి, "రాకుమారి క్షేమంగానే వున్నది. ఆ చెట్టు కింది రాక్షసుడు ఆమెను రాజప్రాసాదం నుంచి ఎత్తుకుపోయిన కుంభీరుడే కదా? రాకుమారి వెంట వున్న ఆ స్త్రీ ఎవరు?" అన్నాడు.

"ఆ ఆడది భిల్లనాయకుడు పులిందుడి పడుచు పదో పెళ్ళాం, సందేహం లేదు," అన్నాడు విరూపుడు.

"పులిందుడి పెళ్ళామా? ఈ సంగతి నాకు తెలియదే. తాను కన్యననీ, మహాకలిరాక్షసుడు, రాకుమారి కాంతిసేనతో పాటు తననూ పెళ్ళాడబోతున్నాడనీ, తాను పాతాళదుర్గ పట్టమహిషిననీ అందరితో చెప్పుకుంటున్నది," అన్నాడు కాలశంబర మాంత్రికుడు.

ధూమకుడా మాటలకు ఏదో జవాబు చెప్పబోయేంతలో, కుంభీరుడు చుట్టూ ఓమారు కలయ చూసి, చప్పున లేచి నిలబడి, రాతిగదను భుజాన పెట్టుకుని, చెట్టుబోదె కేసి పెద్దపెద్ద అంగలు వేస్తూ రాసాగాడు. —(ఇంకా వుంది)






# శక్తిమంతులు

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నిన్ను చూస్తుంటే నా కొక అనుమానం కలుగుతున్నది. పూర్వం విక్రమదేశాన్ని పాలించిన మహేంద్రమహారాజు కొడుకు జయంతుడి లాగే నువు కూడా హీనుల సంపర్కం వల్ల ఈ హేయమైన పని మీద వేసుకున్నా వనిపిస్తున్నది. నీకు రాజకుమారుడైన జయంతుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

మహేంద్రుడు విక్రమరాజ్యాన్ని ఏలినప్పుడు ప్రజలు సుఖంగానే బతికారు కాని, రాజధానిలో అపూర్వమైన తెలివితేటలు ప్రదర్శించే దొంగలు కొంద రుండేవారు.

## బేతాళ కథలు



ధనికులకు వాళ్ళంటే సింహస్వప్నంగా ఉండేది. మామూలు ప్రజలు వాళ్ళను గురించి అసాధారణమైన కట్టుకథలు కూడా చెప్పుకునేవారు.

మహేంద్రుడి కొడుకు జయంతుడు చాలా తెలివైనవాడు. మంచి ధైర్యసాహసాలు కల వాడు. అతను కూడా తమ నగరంలోని దొంగలను గురించి ఎన్నో కథలు విన్నాడు. అందరూ అనుకున్నట్టుగా ఆ దొంగలు అమానుషశక్తులు గలవాళ్ళని అతను నమ్మ లేదు, కాని వాళ్ళకు గల నిజమైన శక్తు లేవో తెలుసుకోవాలని అతనికి చాలా అభి లాషగా ఉండేది. ఏదోవిధంగా ఆ దొంగ లతో పరిచయం చేసుకోవాలని కూడా అతనికి ఆసక్తి ఉండేది.

అందుచేత జయంతుడు ఒక అమావాశ్య రాత్రి నల్లని బట్టలు ధరించి, ఊరంతా మాటుమణిగాక, వీధుల వెంబడి దొంగ లాగా నక్కుతూ కదలసాగాడు. అత నలా కొంతదూరం వెళ్ళేసరికి అకస్మాత్తుగా ఒక నల్లని ఆకారం అతని ఎదట ప్రత్యక్షమై, "ఎవరు నువు?" అని అడిగింది.

"నేను దొంగను," అన్నాడు జయం తుడు చిన్నగొంతుతో.

"నేను గజదొంగను. నాతో రా!" అన్నాడు మొదటి వ్యక్తి.

ఇద్దరూ కలిసి కొంతదూరం వెళ్ళేసరికి మరి ఇద్దరు వారిని కలిశారు. గజదొంగ జయంతుణ్ణి వాళ్ళకు పరిచయం చేసి, "మన జాతివాడే. ఇంకా వయసూ, అను భవమూ ఉన్నట్టు లేవు," అన్నాడు.

"కుర్రాడా, దొంగతనం తేలిక పని కాదు. దొంగవుగా పైకి రావాలంటే మా కున్నట్టుగా నీకూ కూడా ఏదో ఒక ప్రత్యేక శక్తి ఉండాలి," అన్నాడు కొత్త దొంగ లలో ఒకడు.

"మీ కున్న ప్రత్యేక శక్తులేమిటి?" అని జయంతుడు దొంగలను అడిగాడు.

" కుక్క మొరిగితే అదెందుకు మొరిగేదీ నేను చెప్పగలను," అన్నాడు ఒక దొంగ.

" చేతికర్రను నేలకు తాటించి భూమి అడుగున ఏమి పాతిపెట్టి ఉన్నదీ చెప్ప గలను," అన్నాడు రెండో దొంగ.

" ఒకసారి చూసిన మనిషిని ఏ వేషంలో ఉన్నా నేను మళ్లీ పోల్చగలను," అన్నాడు మూడోవాడు.

వాళ్ళు ముగ్గురూ తమ శక్తులు బయట పెట్టాక జయంతుడు కూడా ఏదో ఒకటి చెప్పవలసి వచ్చింది. అందుచేత అతను, " నాకూ శక్తి ఉన్నది. ఎవరు ఎటువంటి చిక్కులో ఉన్నా నేను వారిని కాపాడ గలను," అన్నాడు.

ఈ మాట విని దొంగలు పరమానందం చెంది, " ఆ మాట నిజమైతే నువే మాకు నాయకుడివి. నీ శక్తి ముందు మా శక్తు లేపాటి?" అన్నారు.

" మీకు గల శక్తులు చెప్పారు బాగానే ఉన్నది గాని, చూసి సంతోషించాలని నా కోరిక," అన్నాడు జయంతుడు.

" అదెంత భాగ్యం? అవి మాకు అడు గడుగునా అవసరమే. దొంగతనానికి ఎటు పోదామో నువే చెప్పు. మా శక్తులు నీకే తెలుస్తాయి," అన్నారు దొంగలు.




" మళ్లీ చిన్న చోట్లకు దేనికి? రాజ భవనానికే పోదాం," అన్నాడు జయంతుడు.

నలుగురూ కలిసి రాజభవనం వెనక ప్రాంతానికి వెళ్లి, ప్రహరీగోడ మీదుగా ఉద్యానవనంలోకి దిగారు. అంతలో నే కుక్క మొరిగింది.

" అది మనని చూసి మొరగలేదు. తన యజమానిని చూసి మొరిగింది," అన్నాడు ఒక దొంగ.

మరొక దొంగ ఉద్యానవనంలో కర్రతో అక్కడక్కడా నేల మీద కొట్టి, " నిలువు లోతున ఒక సొరంగం ఉన్నది. మనం దానిలోకి గుంట తవ్వితే ఆ సొరంగం కుండా





రాజభవనంలోకి నిరపాయంగా ప్రవే శించవచ్చు," అన్నాడు.

తోటలో తవ్వేపరికరా లుంటాయి. వాటి కోసం వెతుకుతూ ముగ్గురు దొంగలూ మూడు పక్కలా వెళ్ళగానే జయంతుడు పహరావాళ్ళ దగ్గిరికి వెళ్ళి, తన ముఖం వారిని చూడనిచ్చి, "తోటలో ముగ్గురు గజ దొంగ లున్నారు. వెళ్ళి పట్టుకోండి," అని చెప్పి, తన దారిన తాను భవనంలోని శయ్యాగారానికి పోయి సుఖంగా పడుకుని నిద్రపోయాడు.

ఆ రాత్రి ముగ్గురు గజదొంగలూ పట్టు పడ్డారు. మర్నాడు రాజసభలో వారి విచా రణ జరిగింది. నగరంలోని గజదొంగలు పట్టు పడ్డారని వినగానే వాళ్ళను చూడ టానికి జనం తండోపతండాలుగా వచ్చారు. వాళ్ళ విచారణ ప్రారంభం కాక ముందే జయంతుడు యువరాజు దుస్తులు ధరించి రాజుగారి సమీపంలో కూర్చున్నాడు.

దొంగలను బంధించి రాజుగారి ఎదటికి తెచ్చారు. వాళ్ళ ముగ్గురి ముఖాలూ కోపం తోనూ, విచారంతోనూ నిండి ఉన్నాయి. అంతలోనే వారిలో ఒకడు తల ఎత్తి చూసి, జయంతుణ్ణి గుర్తించి, అందరికీ వినపడే లాగా మిగిలినవాళ్ళతో, "మనవాడు రాజు గారి పక్కనే ఉన్నాడు. మన కేమీ భయం లేదు," అన్నాడు. ముగ్గురు దొంగలూ జయంతుడి కేసి సంతోషంగా చూశారు.

జయంతుడు తండ్రి కేసి తిరిగి, "వాళ్లు నా స్నేహితులు. వాళ్ళను వదిలి పెట్టె య్యండి," అన్నాడు. రాజుగారు ఒక క్షణం పాటు కొడుకు కేసి వింతగా చూసి, దొంగ లను విడిచి పుచ్చమని తన భటులను అజ్ఞా పించాడు. దొంగలు జయంతుడికీ, రాజు గారికీ నమస్కారం చేసి తమ దారిన తాము వెళ్లిపోయారు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. జయంతుడు అలాటి గజదొంగ





లను ఎందుకు చెయ్యిదాటి పోనిచ్చాడు? దొంగలను పట్టి శిక్షించటం రాజపుత్రుడి ధర్మం కద? ఆ ధర్మాన్ని ఎందుకు పాటించ లేదు? పైపెచ్చు ఆ దొంగలు తన మిత్రులని తండ్రికి ఏమని చెప్పాడు? ఇది దొంగల సంపర్కం వల్ల అతనిలో ఏర్పడిన హీనతా భావలక్షణమా? లేక ఇందుకు మరో కారణం ఉన్నదా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఈ సంఘటనలో దొంగల విచారణా, శిక్షా అన్న ప్రశ్నే లేదు. దొంగలను ఎందుకుగాను శిక్షిస్తారు? వాళ్లు ఏ దొంగతనమూ చెయ్యనే లేదింకా. వాళ్ళను పట్టుకుని ఖైదు చేయించటమే జయంతుడి అభిప్రాయమైతే అతను ఆ రోజు సభకు రానవసరం లేదు. ముగ్గురు గజదొంగల శక్తులూ పరీక్షకు వచ్చాయి. ఇద్దరి శక్తులు జయంతుడి ఎదటనే రుజువయాయి. మూడోవాడి శక్తి, జయంతుడి శక్తి రుజువు కావలసి ఉన్నది. ఆ పరీక్ష పూర్తి కావటానికే జయంతుడు కాపలా వాళ్ళకు దొంగలను పట్టి ఇచ్చాడు. దొంగలను రాజభవనానికి తెచ్చినది తానే అయి ఉండీ, వారిని తానే కాపలావాళ్ళకు పట్టి ఇచ్చి ఉండీ కూడా అతను సుఖంగా నిద్ర పోయాడంటే అతని అంతరాత్మలో దురుద్దేశం లేనట్టు స్పష్టమవుతున్నది. రాజసభలో మూడో గజదొంగ జయంతుణ్ణి పోల్చటమే గాక, అతను తమకు సహాయపడతాడన్న విశ్వాసం కూడా చూపాడు. కసకనే జయంతుడు తన తండ్రితో ఆ దొంగలు తన స్నేహితులని చెప్పుకున్నాడు. అన్ని విధాలా జయంతుడి ప్రవర్తనా, బుద్ధిసూక్ష్మతా కొనియాడ దగినవి," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# ఇద్దరు వేటగాళ్లు

ఒక ఊళ్లో శరభయ్య అనే వేటగాడుండే వాడు. అతను గొప్ప ఇంటివాడు. అందు చేత తాను తరచుగా వేటకు పోతూ, గవరన్న అనే పేద ఇంటివాడిని వెంటపెట్టుకు పోతూండేవాడు.

గవరన్నకు కూడా వేటయందు ఆసక్తి హెచ్చు. వేటకు కావలసిన పనులన్నీ గవరన్నే చేసేవాడు. శరభయ్య చేసేదల్లా గవరన్నను అది చెయ్యి, ఇది చెయ్యి అని పురమాయిస్తూ, తొందర పెట్టటమే.

వేటలో దొరికిన వాటిని ఇద్దరూ పంచుకునేవారు. పెద్ద వాటా తాను తీసుకుని, గునుస్తూ, జాలితలిచి యిచ్చినట్టుగా శరభయ్య కొద్దిపాటి వాటాను గవరన్నకు యిస్తూండేవాడు.

ఒకనాడు గవరన్నను వెంట బెట్టుకుని శరభయ్య అడవికి వెళ్ళాడు. శరభయ్య ఒక చెట్టుకింద విశ్రాంతి తీసుకుంటూ ఉంటే గవరన్న ఒకచోట పెద్ద గొయ్యితీసి దానిలో కొమ్మలూ అవీ వేసి, పైన ఆకులూ, గడ్డీ కప్పి, మాటు తయారుచేశాడు. తరవాత ఇద్దరూ తిరిగి వచ్చేశారు.

మర్నాడు ఉదయం వాళ్లు అక్కడికి వెళ్ళి చూసేసరికి, వాళ్లు వేసిన మాటులో ఒక చెవులపిల్లి పడి ఉన్నది.

"ఇందులో నీకు భాగం ఇస్తే మాత్రం నీకేం వస్తుంది? చచ్చు చెవులపిల్లి! అందుచేత దీన్ని నేనే తీసుకుంటాను," అన్నాడు శరభయ్య గవరన్నతో.

"మీరే తీసుకోండి. రేపు ఏ దుప్పిగాని పడవచ్చు. దాన్ని నేను తీసుకుంటాను," అన్నాడు గవరన్న.

"అలాగయేట్టుంటే పోనీ ఈ చెవులపిల్లిని నువే ఉంచుకో. రేపు పడేదాన్ని నేను తీసుకుంటాను," అని శరభయ్య చెవులపిల్లిని గవరన్న కిచ్చేశాడు.

బి. వరలక్ష్మి

గవరన్న మాటు మీద అకులూ గడ్డీ సరి చేసినాక ఇద్దరూ వుత్సాహంగా ఇళ్ళకు వెళ్ళిపోయారు.

ఆ మర్నాడు వాళ్లు వచ్చి చూసేసరికి మాటులో నిజంగానే ఒక దుప్పి పడి ఉన్నది. "ఇవాళ నా వంతు. ఈ దుప్పిని నేను తీసుకుంటాను," అన్నాడు శరభయ్య సంతోషంగా.

"మీరే తీసుకోండి. రేపు ఎనుము పడ వచ్చు. నేను దాన్ని తీసుకుంటాను," అన్నాడు గవరన్న.

శరభయ్య సంతోషమంతా ఇగిరి పోయింది.

"పోనీ ఈ దుప్పిని కూడా నువే తీసుకో. రేపు పడేది నా వంతు కింద తీసుకుంటాను," అన్నాడు శరభయ్య.

ఆ మరుసటి రోజు నిజంగానే మాటులో బలిసిన ఎనుబోతు పడింది. శరభయ్య ఆనందానికి మేర లేదు.

"దీన్ని నేను తీసుకుంటాను. ఇవాళ నా వంతు కద," అన్నా డతను.

"ఈ ఎనుబోతును మీరే ఉంచండి. రేపు నా వంతుకు ఏనుగే పడవచ్చు. మీరు నమ్ముతారో లేదో, ఏనుగు కోసం ఎంత కాలంగా ఆశ పెట్టుకుని ఉన్నానని!" అన్నాడు గవరన్న.



"నాక్కూడా ఏనుగే కావాలి. ఇవాళ వంతు కూడా నువే తీసుకో. రేపు నా వంతుకు ఏనుగు పడితే నేను తీసుకుంటాను," అన్నాడు శరభయ్య.

ఆ మర్నాడు వాళ్ళు వెళ్ళి చూసేసరికి మాటులో నిజంగా ఏనుగే పడి ఉన్నది. శరభయ్య ఆనందం చెప్ప నలవి కాదు. అతడు చిన్నకేక వేసి మాటులోకి గెంతి నంత పనిచేశాడు.

"చూశావా, గవరన్నా? తెలివంటే నాదే తెలివి! వరసగా మూడు రోజులు నీకు వంతు యిచ్చి నేను ఏనుగును సంపాదించుకున్నాను. దీని దంతాలే చేస్తాయి ఎంతైనా!" అన్నా డతను గవరన్నతో.

"ఈ ఏనుగును తప్పక మీరే ఉంచుకోండి. అప్పుడే గాడ్పు ఆరంభమవుతున్నది. రేపు ఈ గోతి నిండా వెలలేని ఆకులు పడతాయి. వాటిని నాకు వదిలెయ్యండి చాలు," అన్నాడు గవరన్న.

"వెల లేని ఆకులా? ఆశ్చర్యంగా వుందే. వాటి నేం చేసుకుంటావు?" అన్నాడు శరభయ్య తెల్లబోయి.

"అమ్ముకుంటాను. మీకు తెలియదా? ఎవరి కిచ్చినా కళ్ళకద్దుకు తీసుకుంటారు," అన్నాడు గవరన్న.

"అలా అయితే ఈ ఏనుగును నువే ఉంచుకుని నా కా వెల లేని ఆకులు వది లేస్తావా ఏమిటి?" అన్నాడు శరభయ్య.

"మీరు ఏనుగును ఉంచేసుకుందురూ? ఆ ఆకులు నాకు వదిలెయ్యండి," అన్నాడు గవరన్న.

"కాదులే. ఈ ఏనుగును నువే తీసుకో," అని శరభయ్య పట్టుబట్టాడు.

మర్నాడు వాళ్లు గోతి దగ్గిరికి వచ్చేసరికి గోతి నిండా రాలుడు ఆకు లున్నాయి. వాటిని శరభయ్య ఆత్రంగా మూటగట్టి, తీసుకుపోయి, అమ్మటానికి ప్రయత్నిస్తే అందరూ అతణ్ణి చూసి నవ్వారు.





# ఇద్దరు తండ్రుల కొడుకు

ఒక చిన్న పల్లెలో సుందయ్యా అనే బక్క రైతు ఉండేవాడు. అతను తనకు గల కొద్దిపాటి పొలం పండించుకుని, దానితో కొద్దిలోనే సుఖజీవనం చేస్తూవచ్చాడు. అతనికి పెళ్ళి అయింది. భార్య కాపరానికి వచ్చి పదేళ్ళయినా సంతానప్రాప్తి లేకపోయింది.

ఇలా ఉండగా, ఆ గ్రామానికి సమీపంలో ఉన్న ఏటి ఒడ్డున ఒక శివలింగం బయటపడింది. ఊరిలోని గ్రామాధికారి శివాలయం కట్టించి, అందులో ఆ లింగాన్ని స్థాపించ నిర్ణయించి, గ్రామస్థులందరినీ యథాశక్తి సాయపడమని కోరాడు. పిల్లల కోసం అప్పటికే ఎన్నో మొక్కులు మొక్కిన సుందయ్యా, శివాలయానికి ద్వారబంధం తానే తయారుచేసి ఇవ్వ నిశ్చయించాడు.

ఒకనాటి ఉదయం సుందయ్యా ఇంత చద్ది మూటగట్టుకుని, గొడ్డలి భుజాన పెట్టుకుని, మంచి గంధపుచెట్టు కోసం వెతుకుతూ అరణ్యంలోకి వెళ్ళాడు. అదృష్ట వశాన అతనికి ఒక పెద్ద మంచి గంధపు చెట్టు కనబడింది. సుందయ్యా పరమానందం చెంది, ఆ చెట్టును ఎక్కబోతూ ఉండగా చెట్టు పక్కనే ఒక రాక్షసాకారం ప్రత్యక్షమై, "అమ్మయ్యా, దొరికావా? చాలా ఆకలి మీద ఉన్నాను. నిన్నిప్పుడే తినేస్తాను," అన్నది.

"నేను దైవకార్యం మీద వచ్చాను. నన్ను చంపటం నీకు తగదు," అన్నాడు సుందయ్యా.

"ఇది నా చెట్టు. ఈ చెట్టు కిందికి వచ్చినవాణ్ణి తిని ఆకలి తీర్చుకునే హక్కు నాకున్నది. నేను నిన్నిక్కడికి రమ్మనలేదు. అంత దైవకార్యం మీద వచ్చిన వాడివి, నా చెట్టు నెందుకు తాకావు?" అన్నాడు రాక్షసుడు.

సి హెచ్. వెంకట్రామన్

పుణ్యానికి పోతే పాపం ఎదురయి నందుకు సుందయ్య బొటబొటా కన్నీరు కార్చసాగాడు.

అది చూసి రాక్షసుడు, "నీ కన్నీరు చూసి నేను కనికరిస్తా ననుకుంటున్నావా? నువు కోసుకుతినే కోళ్ళూ, మేకలూ కంట నీరు పెడితే నువు విడిచిపెడతావా? నేను ఎన్నో ఏళ్ళుగా ఆకలి మీద ఉన్నాను. అందుచేత నిన్ను వదలను," అన్నాడు.

"నేను నా కోసం విచారించటం లేదు. నే ససలే బక్క ప్రాణిని. నువేమో చాలా ఆకలి మీద ఉన్నానంటున్నావు. నన్ను తింటే నీకు సగం ఆకలి కూడా తీరదు. నాకు పిల్లలెలాగూ లేరు. అందుచేత నేనూ, నా భార్యా ఎంతకాలం బతికినా ఒకటే. నా భార్య కూడా వెంట ఉన్నట్టయితే నీకు పూర్తిగా ఆకలి తీరేది గదా, నీ ఆకలి తీర్చిన పుణ్యంతో మాకు వచ్చే జన్మకైనా సంతానం కలిగేది గదా అనుకుని విచారిస్తున్నాను," అన్నాడు సుందయ్య.

రాక్షసుడు కొంచెం ఆలోచించి, "ఇప్పటికి ఇరవై ఏళ్ళుగా ఈ చెట్టు కిందికి వచ్చిన అల్పప్రాణులను తిని ఆకలి తీరక బాధ పడుతున్నాను. నాకు కడుపు నిండా తిండి దొరికేటట్టుంటే ఇంకో ఇరవై ఏళ్ళు ఆగుతాను. నువు నేను చెప్పినట్టు చెయ్యి.



ఈ చెట్టు మీది నుంచి ఒక చిన్న మండ తీసి ఇస్తాను. దాన్ని తీసుకుపోయి, నూరి, రసం తీసి, నీ భార్యకు తాగటానికి ఇయ్యి. ఆ తరవాత ఆమెకు కొడుకు పుడతాడు. వాడికి ఇరవయ్యో ఏడు రాగానే పెళ్ళి చెయ్యి. తరవాత నువ్వూ, నీ భార్యా, నీ కొడుకూ, కోడలూ, నలుగురూ కలిసి రండి. నేను మిమ్మల్ని నలుగురినీ తిని, కడుపు నించుకుంటాను," అన్నాడు.

సుందయ్య ఇందుకు సంతోషంగా ఒప్పుకుని, ద్వారబంధానికి కావలిసిన కర్ర చెట్టు నుంచి కొట్టుకోవటానికి రాక్షసుడి అనుమతి కోరాడు. రాక్షసుడు సరేనని, సుందయ్య భార్య కోసం ఒక చిన్న మండ విరిచి ఇచ్చి, మాయమయాడు.

కొద్ది కాలంలోనే సుందయ్య శివాలయానికి గాను తయారు చేసిన ద్వారబంధం పూర్తి అయింది. ఈ లోపలనే సుందయ్య భార్య గర్భవతి కూడా అయి, సకాలంలో ఒక మగబిడ్డను కన్నది. వాడికి భద్రుడు అని పేరు పెట్టుకున్నారు. వాడు పెరిగి వస్తున్న కొద్దీ జన ముద్దుబిడ్డ అయాడు. గ్రామాధికారికి చాలామంది పుట్టిపోయి, ఒక్కడే దక్కాడు. ఆ పిల్లవాడు కూడా భద్రుడి ఈడువాడే. ఇద్దరూ ఎక్కువగా కలిసి తిరిగేవారు.






వాళ్ళిద్దరూ పదేళ్ళవాళ్ళయి ఉండగా ఒకనాడు కొండ మీదికి వెళ్ళారు. కొండ ఎక్కేటప్పుడు కర్మచాలక, గ్రామాధికారి కొడుకు కాలుజారి, కింద ఉన్న అగాధంలో పడిపోయాడు. భద్రుడు ఏడుస్తూ వచ్చి ఈ విషయం గ్రామాధికారికి తెలిపాడు. గ్రామాధికారికి తన కొడుకు శవం మాత్రమే దొరికింది.

"నా కొడుకు చావుకు భద్రుడే కారణం. నా కున్న ఒక్క కొడుకునూ వాడే పొట్టన పెట్టుకున్నాడు. నాకు పిల్లల్ని కనే వయసు కూడా దాటి పోయింది. సుందయ్యకు కూడా కొడుకు లేకుండా చేస్తేనే గాని నా కడుపుమంట చల్లారదు," అన్నాడు గ్రామాధికారి, పుత్రశోకంతో మతిపోయి.

ఊళ్ళో నలుగురూ అయనను ఊరడించ టానికి ప్రయత్నిస్తూ, "నీకు అదివరకు పుత్ర నష్టం కలిగింది. దాని కెవరు బాధ్యులు? ఎందుకు నిష్కారణంగా ఆ పసి వాడి మీద పగ బట్టుతావు? కాలం తీరి నీ కున్న ఒక్క కొడుకూ పోయాడు, అంతే," అన్నారు.

కాని గ్రామాధికారి శోకం అలా తీరేది కాదు. నిజానికి అయనకూ భద్రుడంటే చాలా ఇష్టం. తన కొడుకూ, భద్రుడూ కలిసి తిరుగుతుంటే తన కిద్దరు కొడుకు లున్నట్టు సంతోషించేవాడు. అందు చేత ఆయన ఒక షరతు పెట్టాడు. అదేమిటంటే: భద్రుడు ఆరునెలలపాటు తన కొడుకుగా ఉండాలి, ఆరునెలలపాటు సుందయ్య కొడుకుగా ఉండాలి.

ఈ ఏర్పాటుకు అందరూ హర్షించారు. సుందయ్య కూడా ఒప్పుకున్నాడు. ఇందు వల్ల సుందయ్యకు వచ్చిన నష్టం లేదు; భద్రుడి హోదా బాగా పెరిగింది. ఒకనాటి మధ్యాన్నం ఈ ఏర్పాటు జరిగింది.

భద్రుడికి పద్దెనిమిదేళ్ళు నిండగానే సుందయ్య సాటి రైతు ఇంట ఒక చక్కని

పిల్లను చూసి తన కొడుక్కు పెళ్ళి చేశాడు. వంతు ప్రకారం భద్రుడు గ్రామాధికారి కొడుకై గ్రామాధికారి ఇంట ఉండటానికి వెళ్ళినప్పుడు ఆయన కూడా ఒక పెద్ద ఇంటి పిల్లను చూసి భద్రుడికి పెళ్ళి చేశాడు. ఇద్దరు కోడళ్ళూ భద్రుడి ఇద్దరు తండ్రుల ఇంటా ఉన్నారు. భద్రుడు ఎవరి ఇంట ఉంటున్నప్పుడక్కడ ఉన్న భార్యతో సంసారం చేస్తూ వచ్చాడు.

భద్రుడికి ఇరవయ్యో ఏడు సుందయ్య ఇంట ఉండగానే వచ్చింది. సుందయ్య రాక్షసుడికిచ్చిన మాట గుర్తుంచుకుని, తన భార్యనూ, కొడుకునూ, గర్భవతిగా ఉన్న తన కోడలినీ వెంట బెట్టుకుని బయలు దేరాడు. వాళ్ళు మంచి గంధపు చెట్టును చేరేసరికి మధ్యాన్న మయింది.

నలుగురూ చెట్టు కిందికి రాగానే రాక్షసుడు ప్రత్యక్షమై, సుందయ్యతో, "నువు నిజాయితీ గలవాడివి. మాట తప్పకుండా వచ్చావు. మిమ్మల్ని అందరినీ తిని ఇవాళ కడుపు నింపుకుంటాను," అన్నాడు.

"కాని ఒక చిక్కున్నది. వీడు కొద్ది క్షణాల నుంచీ నా కొడుకు కాడు, గ్రామాధి కారి కొడుకు," అంటూ సుందయ్య జరిగిన దంతా చెప్పాడు.

"సరే, అలా అయితే నిన్నూ, నీ భార్యనూ, నీ కోడలినీ తింటాను," అన్నాడు రాక్షసుడు.

"నా కోడలిని కూడా నువు తినకూడదు. అది గర్భిణిగా ఉన్నది. దాని గర్భంలో ఉన్న శిశువు ఆరు మాసాలపాటు గ్రామాధి కారిగారి మనవడో, మనవరాలో అవుతుంది. నన్నూ, నా భార్యనూ తిని తృప్తిపడు," అన్నాడు సుందయ్య.

"ఇంతకాలం ఆగినందు కిదా ఫలితం ?" అంటూ చీదరించుకుని రాక్షసుడు మాయ మయాడు. సుందయ్య భార్యతో, కొడుకుతో, కోడలితో ఇంటికి వచ్చేశాడు.





# కొయ్యకత్తి

ఒక రాజుగారి దగ్గిర పతంగు డనే యువకుడు సేవకు కుదిరాడు. వాడు సైనిక శిక్షణ పొందినవాడు. చురుకైనవాడుగా కన బడ్డాడు. అయితే వాడి కింకా సైనికుడుగా పనిచేసే వయసు లేదు. అందుచేత రాజుగారు వాణ్ణి ప్రస్తుతానికి రాజభవన ద్వారాలలో ఒక దాని వద్ద రాత్రికాపలాకు గాను ఏర్పాటుచేశాడు.

ఒక రాత్రివేళ రాజుగారు నిద్ర లేచి కాపలావాళ్ళు సరిగా పనిచేస్తున్నదీ లేనిదీ చూడటం అప్పుడప్పుడూ జరిగేది. ఒకరాత్రి ఆయన అలాగే తిరుగుతుండగా పతంగుడు తన కత్తి పక్కన పెట్టి, గోడ నానుకుని నిద్రపోతున్నాడు. కొత్తగా చేరినవాడు తన విధిని అంత అలక్ష్యం చెయ్యటం రాజుగారు సహించలేకపోయాడు. వాణ్ణి లేపగొట్టి నాలుగు చివాట్లు పెట్టడానికి బదులుగా వాణ్ణి నలుగురిలోనూ కఠినంగా శిక్షించ నిశ్చయించి రాజుగారు వాణ్ణి లేపక, వాడి ఒర నుంచి కత్తి మాత్రం తీసుకుని భవనానికి వెళ్ళిపోయాడు.

కొంతసేపటికి పతంగుడు లేచి తన కత్తి కోసం చెయ్యి చాచాడు. ఖాళీ ఒరమాత్రమే ఉన్నది. పహరావాడు తన కత్తిని పోగొట్టుకోవటం పెద్ద నేరం. అందుకు తలతీసెయ్యవచ్చు. పహరావాళ్ళ దగ్గిర ఉండేవి ప్రత్యేకమైన కత్తులు. అవి ఎక్కడా దొరకవు. వాటిని ఆయుధాగారం నుంచి పహరావాళ్ళకు ఇస్తారు. ఉద్యోగం చాలించుకున్న పహరావాళ్ళు వాటిని ఆయుధాగార రక్షకుడికి తిరిగి ఇచ్చెయ్యాలి. తెల్లవారి సూర్యోదయ మయే వేళకు పహరా మారినప్పుడు రాత్రి కాపలావాళ్లంతా రాజుగారి దగ్గిర కనబడి ఇళ్ళకు పోవాలి. అందుచేత పతంగుడు తెల్లవారే లోపుగా ఒక కత్తి సంపాదించాలి. లేకపోతే పీక తెగిపోతుంది.

టి. ప్రభుదాసు

రాజభవనం సమీపంలోనే పతంగుడికి ఒక వడ్రంగి మిత్రు డున్నాడు. పతంగుడు అతని దగ్గిరికి పరిగెత్తి వెళ్లి, నిద్రలేపి, తన ప్రాణం మీదికి వచ్చిందని జరిగిన సంగతి అతడికి చెప్పాడు.

"పెద్ద కష్టమే వచ్చి పడింది నీకు. కాని నేను మాత్రం ఏం చెయ్యగలను ? కొయ్య కత్తి ఒకటి చేసి ఇస్తాను. పైకి కనిపించేది పిడి మాత్రమే గనక దాన్ని జాగ్రత్తగా తయారుచేస్తాను. ఈ పూట గండం గడిచాక రేపు నీ కత్తి ఎవరో ఎత్తుకు పోయారని రాజుగారి దగ్గిర ఫిర్యాదు చేసి, కొత్త కత్తి అడిగి పుచ్చుకో," అన్నాడు వడ్రంగి.

అతను తెల్లవారే లోపల ఒక చిన్న కొయ్య కత్తి చేసి ఇచ్చాడు. దాని పిడి మాత్రం చాలా పనితనంగా, అసలు కత్తి పిడిలాగే తయారుచేశాడు.

సూర్యోదయం వేళ మిగిలిన పహరా వారందరితో బాటు పతంగుడు కూడా సోల్పులో నిలబడ్డాడు. కొద్ది సేపటికి రాజుగారు అక్కడికి వచ్చాడు. సాధారణంగా ఆయన పహరా తనిఖీకి ఒంటరిగానే వచ్చేవాడు. కాని ఈసారి ఆయన వెంట రాజభటులు ఒక బంధించిన ఖైదీని తెచ్చారు.

రాజుగారు పహరా వాళ్ళ కా ఖైదీని చూపించి, "వీడు రాజద్రోహి. వీడికి మరణ



దండన విధించాను. ఆ శిక్ష నా కళ్ళ ఎదటే జరగాలని ఇక్కడికి తెప్పించాను," అంటూ పహరా వాళ్ళందరి కేసీ ఒకసారి చూసి, పతంగుడి మీద కొంచెంసేపు దృష్టి నిలిపి, "నువు వచ్చి, నీ కత్తితో ఈ దుర్మార్గుడి తల నరికెయ్యి," అన్నాడు.

పతంగుడికి అకస్మాత్తుగా గుండె ఆగి పోయినట్టయింది. వాడి దగ్గిర ఉన్న కొయ్య కత్తి తలలు నరకదు సరేకదా, దాన్ని ఒర నుంచి పైకి తీస్తే, అది అసలు కత్తి కాదన్న సంగతి కాస్తా బయటపడి, పతంగుడి తలకే ఎసరువస్తుంది!

"మహారాజా, నన్ను క్షమించి ఈ పని మరెవరికైనా ఇవ్వండి," అన్నాడు వాడు కంగారుపడుతూ.

"ఎందు కలా కంగారుపడుతున్నావు? నా ఆజ్ఞ ధిక్కరిస్తావా?" అన్నాడు రాజు.

"అది కాదు, మహారాజా. నేను సైని కుణ్ణి, తలారిపని చెయ్యటం నాకు సాధ్యం కాదు. యుద్ధరంగంలో శత్రువును చంప గలను కాని, బంధించి ఉన్న నిరాయుధుడి తల నరకలేను," అన్నాడు పతంగుడు.

"అది పాపమైతే ఆ పాపం నాదే. నా ఆజ్ఞ నిర్వర్తించకపోయావో నీకు మరణ దండన విధిస్తాను," అన్నాడు రాజు భరించ రానంత కోపంగా.

పతంగుడు కళ్ళు మూసుకుని, చేతులు జోడించి, "తల్లీ, భవానీ! నన్నీ ఆపద నుంచి నువే కాపాడాలి. నేను చేసేది నేర మయే పక్షంలో నా కత్తిని కొయ్య కత్తిగా మార్చెయ్యి!" అంటూ ఒర నుంచి కత్తి పైకి లాగాడు. కత్తి పిడి కింద జానెడు పొడుగు కొయ్య కత్తి మాత్రమే ఉన్నది.

పహరావాళ్ళంతా గొల్లున నవ్వారు. రాజు గారికి కూడా నవ్వాగలేదు. ఆయన పతం గుడి తప్పు క్షమించి, వాడి యుక్తికి మెచ్చు కుని, వాణ్ణి పహరా నుంచి తీసేసి, తన అంగరక్షకుడుగా వేసుకున్నాడు.





# తలపాగాశాసనం

మణిమంగళ రాజ్యానికి జయంధరుడు రాజుగా పట్టాభిషిక్తుడు అయిననాటి నుంచీ తలపాగాశాసనం ఒకటి గట్టిగా అమలులోకి వచ్చింది. ఆ శాసనం ఏమిటంటేః రాజ్యంలో ఉండే ప్రతి పురుషుడూ ఇల్లు దాటి వచ్చినప్పుడు కుడికంటి మీదుగా తలపాగా చుట్టుకుని రావాలి. ఈ శాసనాన్ని ఉల్లంఘించిన వారికి మరణదండన విధించబడుతుంది.

ఈ శాసనం వెనక ఉన్న రహస్యమేమంటే, జయంధరుడికి కుడికన్ను గుడ్డిది. అందుచేత అతను చిన్నతనం నుంచీ కూడా ఆ కన్ను మూసుకుపోయేలాగా తలపాగా చుట్టుకు తిరిగేవాడు. ఇప్పుడతను రాజు అయాడు గనక రోజూ సభ చేయాలి. సభలో కూడా కుడి కన్ను మీదుగా తలపాగా పెట్టుకుని కూర్చుంటే పదిమందికీ రహస్యం తెలిసిపోతుంది. అంతమంది ఉండే సభలో రాజుగారు మాత్రమే ఒక కన్ను కనపడేలాగా పాగా చుట్టుకుంటే ఎబ్బెట్టుగా కూడా ఉంటుంది. దీనికి ఏం చెయ్యటమా అని యువరాజు రాజ్యాభిషేకానికి ముందునుంచే దిగులు పడసాగాడు. అది చూసి రాజపురోహితుడు అతనికి తలపాగాశాసనం కిటుకు చెప్పాడు.

ఇంకేం? జయంధరుడు పట్టాభిషిక్తుడవుతూనే తలపాగాశాసనాన్ని దండోరా వేయించాడు. అది మొదలు రాజసభలో అందరి తలపాగాలూ రాజుగారి తలపాగాలాగే, కుడికంటి మీదుగా చుట్టి ఉండేవి. రాజుగారి తలపాగా ఎబ్బెట్టుగా ఉండేది కాదు. వీధుల్లో కూడా అందరూ అలాటి తలపాగాలతోనే తిరిగేవాళ్ళు. అందుచేత పరదేశీయు లెవరైనా వచ్చినా వాళ్ళకు రాజుగారి తలపాగా విడ్డూరంగా కనిపించేది కాదు. కాని రాజ్యంలోని పురుషులకు మాత్రం బయటికి వెళ్ళినప్పుడల్లా ఒక కంటితోనే

జి. కోదండరామయ్య



చూడవలిసిరావటం ఇబ్బందిగానే ఉండేది. అయినా రాజు మిగిలిన విషయాలలో చాలా మంచివాడు, రాజ్యపాలన చాలా బాగుండేది; అందుచేత ప్రజలు తిరుగుబాటు చెయ్యకుండా తలపాగాశాసనాన్ని శిరసావహించారు.

చిక్కేమిటంటే, ఆ రాజ్యానికి ఇతర ప్రాంతాల నుంచి వచ్చేవారికి కూడా తలపాగాశాసనం వర్తించేది. వాళ్ళు కూడా మణిమంగళ రాజ్యంలో వున్నన్నాళ్లూ కుడికంటి మీదుగా తలపాగాలు చుట్టుకు తిరవలిసిందే. వాళ్ళకు మాత్రం ఈ శాసనం చాలా బాధాకరంగా ఉండేది.

జయంధరుడికి ధురంధరు డనే కొడుకున్నాడు. అతనికి తండ్రిలాగా ఒక కన్ను గుడ్డిదికాదు. అతను అందమైనవాడు. అతని కళ్ళు కూడా చాలా అందమైనవి. అయినప్పటికీ అతను ఇల్లు దాటి బయటికి రావలిసి వచ్చినప్పుడు తలపాగాశాసనాన్ని అమలు చేసేవాడు.

ధురంధరుడు యుక్తవయస్కుడయాక దేశసంచారం బయలుదేరాడు. నానా రాజ్యాలలో తనకు నచ్చిన కన్య దొరుకుతుందేమో చూడటం ఈ యాత్ర యొక్క ఉద్దేశం. అతను కొద్ది నెలలపాటు అనేక దేశాలు చూశాక అతనికి కంజర రాజకుమార్తె అందచందాలు నచ్చాయి. అతను స్వదేశానికి తిరిగి వచ్చి తన తండ్రితో, తనకు కంజర రాజకుమార్తె నచ్చిందనీ, వాళ్ళు తన కామెనిచ్చి పెళ్ళి చెయ్యటానికి సుముఖులుగానే ఉన్నారనీ, పెళ్ళి గురించి మాటలు జరపటానికి కంజర మంత్రి త్వరలో రానున్నాడనీ తెలిపాడు. తన కొడుక్కు నచ్చిన కన్య దొరికినందుకు జయంధరుడు కూడా సంతోషించాడు.

అనుకున్న రోజుకు కంజర మంత్రి ఇద్దరు భటుల చేత కానుకలూ అవీ పట్టించుకుని మణిమంగళరాజధానికి వచ్చాడు.

ఆయన వృద్ధుడు. అయితే ఎడమ కన్ను కనబడకుండా తలపాగా చుట్టుకుని ఉన్నాడు. ఆయన విడిదిలోకి దిగగానే, ఆయనకు స్వాగతం చెప్పటానికి వెళ్ళిన రాజోద్యోగులు, "తమరు ఎడమ కంటి మీదుగా తలపాగా చుట్టుకుని ఉన్నారు. కాని మా రాజ్యంలో కుడి కంటి మీదుగా పాగా చుట్టుకోవాలని రాజశాసనం అమలులో ఉన్నది. తమరు కూడా కుడి కంటి మీదుగా తలపాగా ధరించ ప్రార్థన," అని మనవి చేసుకున్నారు.

"అలాగా? చిక్కేమిటంటే, నాకు ఎడమ కన్ను కనబడదు. అందుచేత అది కనబడకుండా తలపాగా చుట్టుకున్నాను. మీ శాసనం ప్రకారం నేను గనక కుడి కన్ను మూసుకు పోయేలాగా తలపాగా చుట్టినట్టయితే ఇక పూర్తిగా గుడ్డివాణ్ణవుతాను. ఏమిటిదారి?" అన్నాడు ముసలి మంత్రి.

తలపాగాశాసనం మహా కఠినమైన శాసనమనీ, ఎవరుగాని ఎలాటి పరిస్థితిలోగాని దాన్ని ఉల్లంఘించటానికి వీలు లేదనీ, మంత్రి కుడికంటి మీదుగా తలపాగా చుట్టటంవల్ల పూర్తిగా అంధుడే అయిపోయే పక్షంలో, నిజమైన అంధులలాగే ఎవరో ఒకరి సహాయం తీసుకోవలసి ఉంటుందనీ రాజోద్యోగులు మంత్రికి తెలిపారు.






గత్యంతరంలేక కంజరమంత్రి శాసనం ప్రకారం తలపాగా చుట్టి, ఎవరో నడిపించుకురాగా రాజసభకు వచ్చి, "రాజా, మీ కుమారుడికి మా కన్య నిచ్చి పెళ్ళి చేయుదలచి, ఆ విషయం మాట్లాడటానికి నేను వచ్చాను. ఇంతపెద్ద పనిమీద వచ్చిన వాణ్ణి మీ అధికారులు తలపాగాశాసనంతో గుడ్డివాణ్ణిచేసి అవమానించారు. ఇలాటి గుడ్డి శాసనాలు చేసేవారితో వియ్యం కలపటానికి మా రాజుగారు ఎంతమాత్రమూ ఒప్పరు. పైన మమ్మల్ని ఇలా అవమానించినందుకు త్వరలోనే యుద్ధంద్వారా మీ పైన ప్రతీకార చర్య జరుపుతాం. అందుకు ఈ నాటినుంచే సిద్ధంగా ఉండండి," అంటూ వెనక్కు తిరిగాడు.

ఈ మాటలు విని జయంధరుడు మండిపడి, "పిల్లనిచ్చే వారికి ఇంత పొగరా? మా దేశపు శాసనం తెలిసికూడా మీ రాజు సగం గుడ్డి మంత్రిని పంపటం మమ్మల్ని అవమానపరచటంకాదా? యుద్ధానికి రండి. యుద్ధంలో మిమ్మల్ని ఓడించి, మీ రాజకుమార్తెను గెలుచుకుని, యువరాజుకు పెళ్ళి చేసుకుంటాం. మీ రెలా అడ్డుతారో చూస్తాం," అన్నాడు.

అంతటితో పోనివ్వక ఆయన కంజర మంత్రిని చెరలో ఉంచమని తన భటులను అజ్ఞాపించి, మంత్రి వెంట వచ్చిన వాళ్ళతో, "మీరు వెళ్ళి మీ రాజును యుద్ధానికి సిద్ధంగా ఉండమని చెప్పండి," అన్నాడు. తరవాత ఆయన తన సేనాధిపతిని పిలిచి, యుద్ధ ప్రయత్నాలు త్వరగా పూర్తిచేసి, కంజరరాజ్యం పైకి దండెత్తి వెళ్ళమని ఉత్తరు విచ్చాడు.

సేనాధిపతి సైన్యంతోసహా బయలుదేరి వెళ్ళి, కొద్ది రోజుల అనంతరం ఒంటరిగా తిరిగి వచ్చి, "మహారాజా, మన సైనికులందరూ శత్రువుకు బందీలుగా చిక్కిపోయారు. నే నొక్కణ్ణే ఎలాగో వారి బారి

పడక తప్పించుకుని, ఈ దుర్వార్త తమ చెవిన వెయ్యటానికి తిరిగి వచ్చాను," అని రాజుతో అన్నాడు.

రాజు నిర్ఘాంతపోయి, "ఇంత దారుణమైన అపజయం మన కెలా జరిగింది? ఈ ఘోరమైన అవమానానికి కారణ మేమిటి?" అని అడిగాడు.

"క్షమించండి, మహారాజా! మన తలపాగాశాసనమే మన కొంప తీసింది. మన సైనికులందరూ కుడికళ్ళ మీదుగా తలపాగాలు చుట్టి యుద్ధరంగం ప్రవేశించారు. వాళ్లకు ఎడమ వైపున ఏ మున్నదీ తెలుస్తుంది గాని, కుడిపక్కన ఏమి జరుగుతున్నదీ తెలీదు కద! ఈ సంగతి గ్రహించి, శత్రు సైనికులు కుడిపక్క నుంచి వచ్చి మన సైనికుల పైన పడి, వాళ్ళ ఆయుధాలు లాగేసుకుని, వాళ్ళను సులువుగా పట్టుకున్నారు. ఇప్పుడు కంజరరాజు తన సైన్యంతో సహా మన రాజ్యాన్ని ఆక్రమించుకోవటానికి వస్తున్నాడు," అన్నాడు సేనాధిపతి.

"ఇప్పు డేమిటి కర్తవ్యం?" అని రాజు మంత్రిని అడిగాడు.

"వెంటనే తలపాగా శాసనం రద్దు చెయ్యండి. మన రాజభవనపు సిపాయీలైనా వీరోచితంగా శత్రువు నెదుర్కొగలుగు



తారు. తరవాత కంజర మంత్రిని చెర విడిపించి క్షమాపణ చెప్పి, పంపెయ్యండి. ఆయన వెళ్ళి, తలపాగాశాసనం రద్దయిందని కంజర రాజుతో చెబుతాడు. ఆ తరవాత ఆయనతో ఎలాగో రాజీ పడిపోవచ్చు," అన్నాడు మంత్రి.

రాజు కొంచెం ఆలోచించి, " ఈ సలహా బాగానే ఉన్నది. ఈ క్షణమే తలపాగా శాసనాన్ని రద్దు చేస్తున్నాం. మంత్రిని విడుదల చేసి, ఆ చెరలోనే పురోహితుణ్ణి ఉంచండి. తలపాగాశాసనం గురించి ఆ పురోహితుడే సలహా ఇచ్చాడు," అన్నాడు.

వెంటనే మంత్రి తన తలపాగా సరిచేసుకున్నాడు. సభలో ఉన్న యావన్మందీ తలపాగాలు సరిచేసుకున్నారు. రాజకుమారుడు స్వయంగా వెళ్లి కంజర మంత్రిని చెర విడిపించి తీసుకొచ్చాడు. తీరా చూస్తే మంత్రికి ఎడమకన్ను గుడ్డిదికాదు. ఆయనకు రెండు కళ్ళూ ఉన్నాయి.

ఇదంతా తాను ఆడించిన నాటకమేననీ, ఈ తలపాగాశాసనం రద్దుచేయించటానికే తాను ఇంత నాటకమూ ఆడాననీ, అందులో కంజర మంత్రీ, తమ సేనాధిపతీ కూడా తాను కోరినవిధంగా పాత్రలు ధరించారనీ, మణిమంగళ సేనకు ఎలాటి అపజయమూ కలగలేదనీ, అసలు యుద్ధమే జరగలేదనీ రాజకుమారుడు తన తండ్రికి చెప్పి, ఆయనను క్షమాపణ వేడాడు.

ఈ తలపాగాశాసనం అమలులో ఉండగా నిజంగా యుద్ధమే వచ్చిఉంటే చాలా నష్టం జరిగేది కదా అనుకుని రాజు జ్ఞానోదయం పొంది, ఆ శాసనాన్ని రద్దు చెయ్యటానికి నాటకం ఆడిన తన కొడుకును క్షమించటమే గాక మె[illegible]చ్చుకున్నాడు కూడా.

ఆ తరవాత ధురంధరుడికీ, కంజర రాజకుమార్తెకూ సలక్షణంగా వివాహం జరిగింది. మణిమంగళ పౌరులు ఆ వివాహాన్ని రెండు కళ్ళతోనూ చూసి ఆనందించారు.






# పనికిమాలిన ధనం

ఒక దేశంలో ఒక మహాధనికు డుండేవాడు. ఆయన తన ధనమంతా మూడు పీపాలలో ఉంచి, వాటిని నేలమాళిగలో ఉంచాడు. ఒకదాని నిండా బంగారు నాణాలూ, రెండో దాని నిండా వెండి నాణాలూ, మూడోదాని నిండా రాగి నాణాలూ ఉండేవి.

ఆ దేశం మీదికి పొరుగుదేశపు సేనలు దండెత్తి వచ్చాయి. అవి అపజయమన్నది లేక దేశాన్ని జయించు కుంటూ రావటం చూసి ధనికుడు పారిపోవటానికి నిశ్చయించాడు. ధనపు పీపాలు వెంట తీసుకు పోవటం అసాధ్యం గనక, ఆయన మైనం కరిగించి, మూడు పీపాలలోని నాణాలమీదా పోయించి, నేలమాళిగకు తాళం కూడా వెయ్యకుండా సకుటుంబంగా దేశం విడిచి పారిపోయాడు.

కొద్ది రోజులకు శత్రుసైన్యాలు వచ్చి ధనికుడుండిన నగరాన్ని ఆక్రమించాయి. సేనాపతి దగ్గిర ఉండి ధనికుల ఇళ్ళలో ఉన్నదంతా స్వాధీన పరచుకుంటున్నాడు. పారిపోయిన ధనికుడి ఇంట గల పీపాలు ఆయన దృష్టిలో పడ్డాయి.

"అవి మైనం పీపాలు. అందుకే ఇంటి యజమాని వాటిని వదిలేసి వెళ్ళాడు. వీటిని ఎవరన్నా కొంటారేమో చూడండి," అని శత్రుసేనాపతి తన భటులకు చెప్పాడు. వాళ్ళు ఎంత ప్రయత్నించినా ఎవరూ వాటిని కొనటానికి రాలేదు.

చివరకు ఒక పేదవాడు వచ్చి, "అయ్యా, నేను మైనంవత్తులు చేసి అమ్ముకుని జీవించేవాణ్ణి, నాకా పీపాలు చవుకగా ఇప్పించండి," అని అడిగాడు. శత్రుసైనికు డొకడు ఆ పేదవా డిచ్చిన చిల్లర డబ్బులు జేబులో వేసుకుని, "వీటికి కాపలా కాయలేక చస్తున్నాను, ఈ పీపాలను త్వరగా ఇంటికి పట్టించుకుపో," అన్నాడు.

ఆర్. శ్రీనివాసరావు

మైనంవత్తుల వాడు, కూలీల ద్వారా ఆ మూడు పీపాలనూ తన ఇంటికి చేర వేయించాడు.

శత్రువులు వెళ్ళిపోయి, పరిస్థితులు స్థిమితపడినాక ఆ పేదవాడు మైనం పత్తులు తయారు చేద్దామని ఒక పీపాలోకి చెయ్యి పెట్టేసరికి చేతి కేదో గట్టిగా తగిలింది. ఏమిటా అని పైకి తీసి చూస్తే బంగారు నాణాలు! అతడు ఆశ్చర్యపడి ఇంకా జాగ్రత్తగా చూసేసరికి, మైనం కింద పీపా నిండా బంగారునాణాలే!

పేదవాడు ఆత్రంగా మిగిలిన రెండు పీపాలూ పరీకించి, వాటి నిండా వెండి, రాగి నాణాలున్నట్టు తెలుసుకున్నాడు. అతనికి అంతులేని ఆశ్చర్యమూ, సంతోషమూ కలిగాయి. అయితే అతను ఈ సంగతి ఎవరికీ తెలియనివ్వక, ధనపు పీపాలున్న గదికి గట్టి ద్వారమూ, తాళమూ, మిగిలిన బందోబస్తులూ ఏర్పాటు చేసి, దారిద్ర్య భయం లేకపోయినా, పైకి పటాటోపం ఏమీ కనబడకుండా సుఖంగా జీవయాత్ర గడపసాగాడు.

కాలం గడుస్తున్నది. ఆ పేదవాడి దగ్గిర ఉన్న నిధి ఎప్పటికి ఖర్చుగాను? ఏ జమీందారు లాగానో బతకటం ప్రారంభిస్తే, ముప్పు తప్పదు. అందుకని ఒకనాడు



తన మిత్రుడైన దర్జీ దగ్గిర బట్టలు కుట్టించుకుని అతను దర్జీకి గుప్పెడు బంగారు నాణాలిచ్చాడు.

దర్జీ ఆశ్చర్యపోయి, "ఇంత డబ్బేమిటి? నేను తీసుకోను. నా కుట్టుకూలి నాకిచ్చెయ్యి చాలు," అన్నాడు.

"నా దగ్గిర పీపాడు బంగారం ఉన్నది. ఏంచేసుకునేది? నువ్వేమైనా ధనవంతుడివి గనకనా? ఈ బంగారం ఉంచు," అన్నాడు మైనంవత్తులు చేసేవాడు.

ఈ మాటలో దర్జీకి ఏమాత్రం నమ్మకం కుదరలేదు.

"నీ కంత బంగారం ఎట్లా వచ్చింది? మతి చెడినట్టు మాట్లాడుతున్నావు," అన్నాడు దర్జీ.

"నా వెంటరా. కళ్ళారా చూతువుగాని," అని మైనంవత్తులు చేసేవాడు తన దర్జీ మిత్రుణ్ణి తీసుకుపోయి, పీపాలలో ఉన్న బంగారు నాణాలూ, వెండి నాణాలూ, రాగి నాణాలూ చూపించి, "ఇదంతా నేనేం చేసుకునేది? ఇందులో సగం నీ కిస్తాను, పట్టుకుపో!" అన్నాడు.

దర్జీ తన జేబులో రెండు గుప్పిళ్ళు బంగారం తీసి పోసుకుని, "ఇది చాలు, నేను జీవితాంతం దాకా సుఖంగా బతకటానికి. నే నొకటి చెబుతాను విను. ఈ డబ్బు నువు వెయ్యి సంవత్సరాలలో కూడా ఖర్చు చెయ్యలేవు. చూసి సంతోషించవలసిందే. ఇది వట్టి నిరర్థకమైన డబ్బు. అందుచేత దీన్ని రహస్యంగా పేదవాళ్ళందరికీ పంచెయ్యి. వాళ్ళయినా సుఖపడిపోతారు. డబ్బు సద్వినియోగమవుతుంది," అన్నాడు.

మైనంవత్తులు చేసేవాడికీ సలహా నచ్చింది. అతను రహస్యంగా తన వెండి బంగారాలను వాళ్ళకూ, వాళ్ళకూ చాలా వరకు పంచేసి, మిగిలిన దానితో జీవితాంతం వరకూ హాయిగా గడిపాడు.





# కష్టాలద్వారాసుఖప్రాప్తి

విశ్వపురపు ఆస్థానానికి ఒకసారి ఒక గొప్ప జ్యోతిష్కుడు వచ్చాడు. ఆయన అనేక మంది జాతకాలు చూసి ఫలితాలు చెప్పి, అందరినీ ఆశ్చర్యపరిచాడు. అది చూసి విశ్వపురపు సేనాపతి తన కొడుకైన ప్రేమ దత్తుని జాతకం తెచ్చి జ్యోతిష్కుడికి చూపిస్తూ, "అయ్యా, వీడు నాకు ఒక్కడే కొడుకు. అస్తమానమూ ఏ లోకంలోనో ఉంటున్నట్టుంటాడు. కవిత్వం రాస్తాడు. వీడు వీరోచితంగా బతికి నా పేరు నిలబెట్ట గలుగుతాడని తోచటంలేదు," అన్నాడు.

జ్యోతిష్కుడు ప్రేమదత్తుని జాతకం పరీక్షించి, "ఏమిటి అలా అంటారు? ఈ కుర్రవాడికి రాజయోగం ఉన్నది. చిన్న తనంలోనే సింహాసనం ఎక్కి, ఆ జన్మాంతం రాజ్యపాలన చేస్తాడు," అన్నాడు.

జ్యోతిష్కుడి మాటలు సేనాపతికి నమ్మ శక్యంగా తోచలేదు. కాని రాజుగారి ముఖం చూసినాక ఆయన గుండె ఒక్కసారిగా చల్లబడింది. నిజానికి రాజుగారు జ్యోతిష్కుడి మాట విన్న మరుక్షణమే ప్రేమ దత్తును తన గర్భశత్రువుగా జమకట్టేశాడు. ఈ జ్యోతిష్కుడు ఇంతమంది జాతకాలు చూసి ఉన్నది ఉన్నట్టు చెప్పాడు. అలాటి వాడు ప్రేమదత్తు గురించి పొరపడటం జరగదు. వాడు ఏనాడైనా తన సింహాసనానికి ఎసరుపెట్టవచ్చు ననుకున్నాడు రాజు.

రాజు ముఖం చూడగానే రాజుగారి ఆలోచన సేనాపతికి అర్థమైపోయింది. సేనా పతికి రాజభక్తి ఎంతైనా ఉన్నది. కాని రాజ యోగం గల తన కొడుకును రాజు చంపించ కుండా విడిచిపెడతా డన్న నమ్మకం కొంచెం కూడా లేకపోయింది. రాజుదాకా ఎందుకు? తన కొడుకు రాజద్రోహం తలపెట్టిన మరు క్షణం తానే వాణ్ణి చంపిస్తాడు. అలాటప్పుడు పరిస్థితి విషమించేదాకా చూస్తూ ఊరు

పి. గంగాధరరావు





కోవటం అవివేకం. సేనాపతి తన కొడుకును విడిచిపుచ్చ నిశ్చయించాడు.

ఆయన ప్రేమదత్తుడితో, "ఒరే, నువు ఇన్నాళ్ళూ కవిత్వం రాస్తూ, ఊహాలోకాలలో విహరిస్తూ నాకు ఏవిధమైన కీర్తిప్రతిష్ఠలూ తెచ్చావు కావు. భవిష్యత్తులో రాజ్యపాలన చేస్తావంటే నాకు సంతోషంగానే ఉన్నది. కాని ఇది దక్కే సంతోషం కాదు. నిన్ను రాజుగారు రహస్యంగానైనా సరే చంపిస్తారు గాని, వదిలిపెట్టరు. అందుచేత నువు ఈ రాత్రే దేశం వదిలి వెళ్ళిపో. ఎక్కడోక్కడ నువు బతికుంటే నాకు చాలు," అన్నాడు.

ఆ రాత్రే ప్రేమదత్తుడు విశ్వపురం రాజ్యాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోయాడు. సేనాపతి మర్నాడు రాజుతో, "మహారాజా, మన రాజ్యంలో తమకూ, తమ సంతతికీ తప్ప రాజయోగం గల మరొకడికి స్థానం లేదు. నేను జ్యోతిష్కుడి మాటలు విని నా కొడుకుకు దేశబహిష్కరణ విధించాను. వాడు మన రాజ్యపు సరిహద్దులో కనిపిస్తే మరణదండన అమలు జరపటానికి కూడా ఏర్పాట్లు చేశాను," అన్నాడు.

ఈ మాట విని రాజు తృప్తిచెందాడు. ఆయన మనసులో ఉన్న విచారమంతా దిగిపోయింది.

జ్యోతిష్కుడి మాటలో ఏమాత్రమూ నమ్మకం లేనివాడు ప్రేమదత్తుడు ఒక్కడే. అతనికి కవిత్వం రాసీ, చదువుకునీ ఆనందంలో మునిగితేలటం తప్ప రాజ్యకాంక్ష, రాజ్యాలు సంపాదించుకునే శక్తీ ఏకోశానా లేవు. అలాటి పరిస్థితుల్లో తాను ఇల్లు వాకిలి వదిలిపెట్టి దేశాంతరాలు పట్టిపోవటం ఏమాత్రమూ అర్థంలేనట్టుగా కనబడింది. ఒకొక్కసారి తన స్థితిచూసి అతను వెర్రివాడిలాగా నవ్వుకునేవాడు; ప్రపంచానికి మతి పోయిందనుకునేవాడు.

వేళకు తిండిలేకా, ఎండకూ, వానకూ గురి అవుతూ, తలదాచుకునే చోటులేకా





ప్రేమదత్తుడు చాలా దారుణమైన కష్టాలు అనుభవించాడు. క్రమంగా అతనికి ప్రపంచం పైనా, జీవితం పైనా రోత పుట్టుకొచ్చింది. ఆకలిదప్పులతో అలమటించే ప్రేమదత్తుణ్ణి కవితాకన్య కూడా విడిచిపెట్టేసింది.

ఒకనా డతను ఒక కాలిబాట వెంట నడుస్తూ, శోషవచ్చి, స్పృహతప్పి దారిలోనే పడిపోయాడు. అక్కడికి కొద్ది దూరంలో ఉన్న ఒక గుడిసె నుంచి ఒక అమ్మాయీ, ఒక ముసలిదీ వచ్చి, అతనికి శైత్యోపచారాలు చేసి, స్పృహ తెప్పించి, తమ సహాయంతో అతన్ని గుడిసెకు తీసుకుపోయి ఒక మంచం మీద పడుకోబెట్టారు. కాస్త తిండి లోపలికి పోయాక ప్రేమదత్తుడి మనస్సు కూడా కొంచెం ఉత్సాహం పొందింది.

ఇల్లు వదిలిన ఇంతకాలానికి ప్రేమదత్తుడు సాటివాళ్ళ ఆదరం చవిచూశాడు. అతనికి మనుష్యుల మీదా, జీవితం మీదా మళ్ళీ కాస్త మమత ఏర్పడసాగింది.

ఆ గుడిసెలో ఉండే అమ్మాయీ, ముసలిదీ చాలా మంచివాళ్ళుగా కనపడ్డారు.

"మీ రెవరు? ఏ వూరు?" అని ఆ అమ్మాయి అతన్ని అడిగింది.

"నా కెవరూ లేరు. నా పేరు ప్రేమదత్తుడు. జీవితంలో నాకున్న ఆనందమల్లా మంచి కవిత్వం పఠించటమూ, రచించటమూనూ," అన్నా డతను.

"నేనూ అలాటి పరిస్థితిలోనే ఉన్నాను. ఈ అవ్వ తప్ప నా కూడా అయినవాళ్ళెవరూ లేరు. మీకు కావలిసింది కవిత్వం రాసుకోవటమే అయితే, మాతోపాటు ఈ గుడిసెలోనే ఉండిపోవచ్చు. దిక్కులేని తిరుగుడు దేనికి? ఎప్పుడు ఈ గుడిసె మీదా, మా మీదా విసుగుపుట్టితే అప్పుడే వెళ్ళిపోవచ్చు," అన్నదామె.

"నన్ను మీరింత ఆదరంతో చూస్తుంటే నాకు మీ మీద ఎందుకు విసుగు పుట్టుతుంది?" అన్నాడు ప్రేమదత్తుడు.

"నేను అనాకారిదాన్ని. నా ముఖం చూడగా చూడగా ఎవరికైనా విసుగు పుట్ట వచ్చు," అన్నదా అమ్మాయి.

ప్రేమదత్తుడు ఆశ్చర్యంగా ఆమె కేసి చూసి, "నువు అనాకారిదానివా?" అని, ఆమె అంతస్సౌందర్యాన్ని పొగడుతూ ఒక పద్యం రాశాడు. ఆ పద్యం చూసి ఆ అమ్మాయి ఆనందాశ్రువులు రాల్చింది.

రోజులు గడుస్తున్నాయి. ప్రేమదత్తుడు ఆ అనాకారి అమ్మాయి పైన ఎంతో అభి మానం చూపుతూ వస్తున్నాడు. అది చూసి అవ్వ ఒకనాడు, "నాయనా, ఈ పిల్లకు పెళ్లియీడు మించిపోయింది. అనాకారి అని ఎవరూ పెళ్ళాడారు కారు. పెళ్ళి కాని పిల్ల ఊళ్లో ఉంటే నలుగురూ అస్తమానమూ ఆడిపొయ్యసాగారు. వాళ్ల సూటి పోట్లు భరించలేక, ఊరికి దూరంగా ఇక్కడ ఈ పాక వేసుకుని ఉంటున్నాం," అన్నది.

"ఈ పిల్లలో అనాకారితనమే చూసిన వాళ్ళు మూర్ఖులు. ఈమె హృదయంలోనూ, మనస్సులోనూ ఎంతో సౌందర్యం ఉన్నది. నే నీమెను ప్రేమించాను. పెళ్ళాడగలను కూడా. కాని నా బోటి బికారిని పెళ్ళాడి ఈమె ఏం సుఖపడుతుంది? ఇన్నాళ్ళు మీరు గనక నన్ను పోషించారు గాని, నాకు




ఒక్క పూట మిమ్మల్ని పోషించే శక్తి కూడా లేదు," అన్నాడు ప్రేమదత్తుడు.

"నీకేం, నాయనా, అందగాడివి. ఇవాళ ఈ అమ్మాయిని ప్రేమించా నంటున్నావు. కాని ఈ 'ప్రేమ' ఎంత కాలం ఉంటుంది? రేపు చక్కని పిల్ల కనబడితే ఆమెనే ప్రేమి స్తావు," అన్నది అవ్వ.

"నేను ఎప్పటికైనా పెళ్ళాడితే ఈమెను తప్ప పెళ్ళాడనని ప్రమాణం చేస్తాను," అన్నాడు ప్రేమదత్తుడు.

"మాకు నీ బీదరికం చూస్తే భయం లేదు, నాయనా. వెంటనే మీ ఇద్దరికీ పెళ్లి ఏర్పాటు చేయిస్తాను," అన్నది అవ్వ.

మర్నాడు పెళ్ళి ముహూర్తానికి ఆ దేశపు రాజుగారే సపరివారంగా బయలుదేరి రావటంతో అసలు సంగతి బయటపడింది. ఆ గుడిసెలో ఉండే అమ్మాయి ఆ దేశపు రాజుగారి కూతురే. ఆమె పేరు చంద్రిక. ఆమెకు యుక్తవయసు రాగానే తండ్రి ఆమె పెళ్ళి తలపెట్టాడు. అనాకారి అని ఎవరూ ఆమెను పెళ్ళాడటానికి ముందుకు వచ్చారు కారు. రాజు, ఆమెను పెళ్ళాడటానికి ఒప్పుకున్న వాడికి అర్ధరాజ్యం ఇవ్వటానికి కూడా సిద్ధపడ్డాడు. కాని చంద్రిక ఒప్పుకోలేదు.

"అందం చూసి మోహించిన వాడు ప్రేమించలేడు; రాజ్య లోభంతో నన్ను పెళ్ళాడేవాడు ప్రేమించబోడు. నాకు కావలసిన నిజమైన ప్రేమ ఈ రాజభవనంలోకి అడుగు పెట్టదు. నన్ను దూరంగా ఒక గుడిసెలో ఒక ఏడాది ఉండ నివ్వండి. ప్రేమ నన్ను వెతుక్కుంటూ వస్తుంది," అన్నది చంద్రిక తండ్రితో.

కూతురు చెప్పిన మాట రాజుకు సమంజసంగానే కనబడింది. ఆయన నగరానికి దూరంగా ఒక గుడిసె వేయించి, అందులో చంద్రిక జీవనానికి అవసరమైన ఏర్పాట్లు చేసి, చిన్నతనం నుంచీ ఆమెను పెంచిన దాదిని తోడుగా ఉంచాడు. అనేక వారాలూ నెలలూ గడిచిన మీదట ప్రేమ అనేది ప్రేమదత్తుడి రూపంలో ఆ గుడిసెలోకి అడుగు పెట్టింది.

ఈ సంగతులన్నీ విన్నాక ప్రేమదత్తుడు చంద్రికతో తన అసలు కథ చెప్పాడు. ఇద్దరూ కష్టాలద్వారానే సుఖం సంపాదించుకున్నారు. వాళ్ళ కష్టాలే వాళ్ళమధ్య ప్రేమబంధమయాయి.

రాజుగారు తన కూతురినీ, కాబోయే అల్లుణ్ణీ పెద్ద ఊరేగింపుతో నగరానికి తీసుకుపోయి, వాళ్ళకు పెళ్ళి చేసి, ఆ రోజునే తన అర్థరాజ్యానికి అల్లుణ్ణి అభిషిక్తుణ్ణి కూడా చేశాడు.






# మంత్రపుకమ్చి

ఒకప్పుడు మళయాళదేశంలో మామూలు మనుషులు కూడా మంత్ర విద్యలు నేర్చేవారు. అయితే వాళ్ళు బతుకు తెరువుకు వేరువేరు వృత్తులు చేసుకునేవారు.

ఒక తంబిరాన్ వద్ద ఒక బండి తోలేవాడు ఉండేవాడు. తంబిరాన్ బండీ మీద ఎక్కడికైనా పోవలిసి వచ్చినప్పుడు బండిని తోలటం తప్ప వాడి కింకేమీ పనిలేదు. తంబిరాన్‌గారి బండిని లాగటానికి ముప్పై గుర్రాలు ప్రత్యేకంగా ఉండేవి. వాటిని సంరక్షించటానికి వేరే మనుషు లుండేవారు.

ఒకనాడు తంబిరాన్ బండీలో ఎక్కడికో పోతూ ఉండగా, ఒక చోటికి వచ్చేసరికి గుర్రాలు చటుక్కున ఆగిపోయాయి. బండి వాడు ఎంత అదిలించినా అవి ఒక్క అడుగు కూడా ముందుకు కదలలేదు.

బండివాడు తల ఎత్తి చూసేసరికి ఒక ఇంటి కప్పు మీద ఒక మనిషి కప్పునేస్తూ కనిపించాడు. బండివాడు ఆ మనిషిని కేకపెట్టి, "అన్నా, మమ్మల్ని మా దారిన వెళ్ళనీ!" అన్నాడు.

ఆ మనిషి కప్పు మీది నుంచి కిందికి చూసి, "నాతోనేనా మాట్లాడుతున్నావు? నా మానాన నేను పనిచేసుకుంటున్నాను. నిన్ను అడ్డానా? నిక్షేపంగా నీ దారిన వెళ్ళు," అన్నాడు.

బండివాడు మారు మాట్లాడక తన కమ్చి పైకి తీసి, దాని మీద మూడుసార్లు ఊది, బండి గుర్రాలను గట్టిగా కొట్టాడు. మరుక్షణమే ఇంటి కప్పుమీద ఉన్న మనిషి కెవ్వున అరిచి కిందపడి, గిలగిలా తన్నుకోసాగాడు.

ఇదంతా కళ్ళారా చూసిన తంబిరాన్ తన బండివాడికి చేతబడి తెలుసునని గ్రహించి, వాణ్ణి క్షణంకూడా ఉంచుకోవటం ఇష్టంలేక, ఒక ఏడాది జీతం అదనంగా

ఎ. సత్యనారాయణ

ఇచ్చి, "ఇక నువు నాకు బండి తోలనవసరంలేదు," అని చెప్పి పంపించేశాడు.

బండివాణ్ణి పంపేశాక తంబిరాన్‌గారి గుర్రాలు చిత్రంగా ప్రవర్తించసాగాయి. అవి కాసావాళ్ళను దగ్గిరికి రానిచ్చాయికావు. వాళ్ళు గడ్డిగాని, బొక్కెనతో నీరుగాని తీసుకుని దగ్గిరికి వస్తే అవి వెనక కాళ్ళమీద లేచి నిలబడి, గట్టిగా సకిలించి, ముందు కాళ్ళతో భయంకరంగా తన్న వచ్చేవి. ఇలా చేసి అవి మూడు రోజులపాటు మేతగాని, నీరుగాని ముట్టలేదు.

తంబిరాన్, ఇదంతా బండివాడి పని అయి ఉంటుందనుకుని, వాణ్ణి పిలుచుకు రమ్మని మనిషిని పంపాడు. ఆ మనిషి వెళ్ళి, "నిన్ను యజమానిగారు వెంటనే రమ్మంటున్నారు," అన్నాడు.

"ఆయన నా కిప్పుడు యజమాని కాడు. నే నింటో లేననిచెప్పు," అని బండివాడు ఆ మనిషిని పంపేశాడు.

మధ్యాన్నం దాటి మరొక మనిషి వచ్చి యజమానిగారు రమ్మంటున్నారన్నాడు.

"యజమానిగారి గొంతు నన్ను పొమ్మనటం చెవులబడిందిగాని రమ్మనటం నా చెవులపడలేదే?" అన్నాడు బండివాడు.

చేసేదిలేక తంబిరాన్ సాయంకాలం తానే స్వయంగా వెళ్ళి బండివాణ్ణి వెంటపెట్టుకు వచ్చాడు. వాడు వచ్చేసరికి గుర్రాలసాల నానా భీభత్సంగానూ ఉన్నది. బండివాడు తన పాత కమ్చీ గోడ నుంచి తీసి, గుర్రాల దగ్గిరికి వచ్చి, "మీకేం పొయ్యేకాలం?" అంటూ దాన్ని గాలిలో ఛెళ్ళు మనిపించి, కాసావాళ్ళతో, "గడ్డి తెచ్చివెయ్యండి. ఎట్లా తినవో చూస్తాను!" అన్నాడు.

గుర్రాలకు దయ్యం వదిలినట్టయింది. అవి ఏమీ ఎరగనట్టు మేత తిని నీళ్ళు తాగాయి. తంబిరాన్ బండివాడి జీతం పెంచి, ముసలివాడైన దాకా వాణ్ణి తన నౌకరీలోనే ఉంచుకున్నాడు.





# కృష్ణావతారం

కంసుడు చచ్చిన వార్త తెలియగానే అతని భార్య లందరూ మూర్తీభవించిన శోక దేవతలలాగా వచ్చి, తమ భర్త కళేబరం మీద పడి వైనవైనాలుగా ఏడ్చారు. మూడు లోకాలలోనూ కంసుణ్ణి జయించ గలవాడు లేడని వాళ్ళ నమ్మకం. అలాటివాడు ఒక కుర్రవాడి చేతిలో ఇంత దారుణంగా మరణిస్తాడనీ, ఇంతలోనే తమకు వైధవ్యం సంప్రాప్త మవుతుందనీ వారు అనుకోలేదు.

కంసుడి తల్లి కూడా తన కోడళ్ళతో బాటు కొడుకు కోసం దుఃఖించింది. ఆమె తన భర్త అయిన ఉగ్రసేనుడి వద్దకు వెళ్ళి, "పిడుగు పడి కూలిపోయిన కొండలాగా పడి ఉన్న నీ కొడుకును చూసుకున్నావా? వాడికి దహనసంస్కారాలు జరపాలి గదా? తన బాహుబలంతో కృష్ణుడు రాజ్యాన్ని గెల్చుకున్నాడు. కృష్ణుణ్ణి ఉత్తరక్రియలకు అనుమతించమని అడుగు," అన్నది.

కంసుడి చావు చూసి మరీ వెళ్ళిపోదామన్నట్టుగా సూర్యుడు అస్తమించాడు. ఆ సంధ్యవేళ యాదవుల మధ్య ఉన్న కృష్ణుడికి కంసుడి భార్యల రోదనలు వినవచ్చాయి. అతని కళ్ల నీళ్ళు తిరిగాయి. అతను తన చుట్టూ ఉన్న బంధుజనంతో, "నేను అతి బాల్యం మూలాన ఉద్రేకంతో ఎంత మంది స్త్రీలకు వైధవ్యదుఃఖం కలిగించాను! కాని, నిజం ఆలోచిస్తే, కంసుడి దుర్మార్గానికి మరొక విరుగుడు లేదు. ఈ దుర్మార్గుడిలాగా తన తండ్రిని నిర్బంధంలో ఉంచి తానే రాజ్యం ఏలినవా డెక్కడైనా

12. బలరామకృష్ణుల విద్యాభ్యాసం





రాజ్యం నీదే. నువే రాజువు. ఏ లోటూ లేకుండా మహా వైభవంగా రాజరికం అనుభవించు. నీ శత్రువు పోయాడు గనక, నీ మనసులో పగ పెట్టుకోక, నా బోటివారి పట్ల ఆదరంతో ప్రవర్తించు. ప్రస్తుతం కంసుడి ప్రేతవిధి జరగవలసి ఉన్నది. ఇందుకు నువు అనుమతించే పక్షంలో నేనూ, నా భార్యా, నా కోడళ్ళూ ఇన్ని నీళ్ళు వదలుతాము. ఆ తరవాత నేను జటావల్కలాలు ధరించి అరణ్యవాసం చేసుకుంటాను," అన్నాడు.

ఆ మాటకు కృష్ణుడు, "దీనికి నా అనుమతి కావాలా? కంసుడి ఉత్తరక్రియలకు నేను అభ్యంతరం చెబుతానా? ఒక్క మాట చెప్పవలసి ఉన్నది. నాకు రాజ్యంతో పని లేదు. నేను రాజధనం మీది ఆశ కొద్దీ కంసుణ్ణి చంపలేదు. వంశద్రోహీ, లోకకంటకుడూ కనక లోకహితం కోరి అతన్ని చంపాను. అందువల్ల నాకు వచ్చే కీర్తి చాలు. ఇక నేను నా మానాన ఆవులమందల మధ్యకు వెళ్ళి, అడవి జంతువులాగా గోపాలకులతో కలిసి ఆటలూ, పాటలూ సాగిస్తాను. నా మనవి ఒకటి ఉన్నది. నే నీ మాటలు కపటంగా అంటున్నవి కావు. న్యాయంగా నీదైన

ఉన్నాడా? పాపిని చూసి జాలిపడటం కూడా పాపమే నని చెబుతారు. లోకక్షేమం కోరి నే నీ దుర్మార్గుణ్ణి చంపాను. ముందు ఏం చెయ్యాలో కూడా నేను ఆలోచించే పెట్టాను," అన్నాడు.

అత నిలా అంటూండగానే ఉగ్రసేనుడు, శిని మొదలైన యాదవవృద్ధులను వెంటబెట్టుకుని వచ్చి, కృష్ణుడి ముందు కొద్దిసేపు తల వంచుకుని నిలబడి, కన్నీరు కార్చి, తల ఎత్తి, గద్గద కంఠంతో, "నాయనా, అతి భయంకరుడైన శత్రువును హతమార్చి గొప్ప ఖ్యాతి సంపాదించుకున్నావు; యాదవ వంశానికి మహదానందం చేకూర్చావు. ఇక







రాజ్యాన్ని నీచుడై నీ కొడుకు హరించాడు. అది చివరకు నీదే అయింది. హాయిగా రాజ్యాభిషేకం చేసుకో. ఈ రాజ్యం నేను గెలిచి నీ కిస్తున్నాను. నా మీద వాత్సల్య ప్రేమలున్న పక్షంలో నా కోరిక నిరాకరించ వద్దు," అన్నాడు.

అనటంతో పోనివ్వక కృష్ణుడు ఉగ్ర సేనుడికి అప్పటికప్పుడే అందరి మధ్యా రాజ్యాభిషేకం జరిపించేశాడు. ఉగ్రసేనుడు బలరామ కృష్ణులకు చేయించవలసిన సంస్కరణలన్నీ చేయించాడు. కృష్ణుడు పూనుకుని మధురానగరాన్ని పూర్వంకన్న చాలా వైభవంగా తయారుచేశాడు.

ఒకనాడు అతను బలరాముడితో, "మనం పుట్టిన నాటినుంచీ చదువూ, సంస్కారమూ, ఆచారమూ లేకుండా అడవుల వెంటబడి తిరిగాం. ఇప్పటికైనా ఒక గురువు దగ్గిర చేరి చదువుకోవటం మంచిది గదా!" అన్నాడు.

ఈ ఆలోచన రాగానే బలరామకృష్ణులు తమ అభిప్రాయాన్ని అయినవాళ్ళకు చెప్పి, వారి అనుమతితో అవంతిపురంలో ఉండే సాందీపను డనే బ్రాహ్మణుడి వద్దకు వెళ్ళి, తమ గోత్రనామాలు తెలుపుకుని, చదువు చెప్పమని ప్రార్థించారు. ఆయన వాళ్ళను తన శిష్యులుగా పరిగ్రహించి, అరవైనాలుగు రోజులలో నాలుగు వేదాలూ, షడంగాలూ చెప్పాడు. వాళ్ళు పన్నెండు రోజులలో ధర్మశాస్త్రమూ, తర్కమూ, న్యాయ శాస్త్రమూ, గణితమూ, సంగీతమూ, సైనిక విద్యలూ నేర్చుకున్నారు, యాభై రోజులలో అస్త్రశాస్త్రం పూర్తిగా అభ్యసించారు. సాందీపనుడు వారి అధ్యయన శక్తి చూసి, "వీళ్లు మానవ రూపంలోవచ్చిన సూర్య చంద్రులా ఏమిటి?" అనుకుని ఆశ్చర్యం పొందాడు.

బలరామకృష్ణులు గురువు వద్ద విద్యా భ్యాసం పూర్తిచేసి, ఆయనకు నమస్క



రించి, "మీ దయవల్ల మేము విద్యావంతుల మయాం. మా వల్ల మీకు ఏం కావాలో కోరండి. ఎంత దుర్ఘటమైనా సరే, మీ కోరిక నెరవేరుస్తాం," అన్నారు.

ఆ మాట విని సాందీపనుడు, "నా కొక కొడుకుండేవాడు. వాడు తీర్థయాత్రలు చేస్తూ సముద్రస్నానం చేస్తూండగా ఒక తిమి వాణ్ణి మింగింది. ఆ పుత్రశోకం నన్నిప్పటికీ దహించుతూనే ఉన్నది. నా కొడుకును ఎలాగైనా నాకు తిరిగి ఇప్పించండి, అంతేచాలు," అన్నాడు.

ఆయన కోరిన గురుదక్షిణ చెల్లించటానికి నిశ్చయించి కృష్ణుడు, అన్న అనుమతి పొంది, ధనుర్బాణాలు తీసుకుని సముద్ర తీరానికి వెళ్ళి, సముద్రుడితో, "మా గురువుగారు సాందీపనుడు తన కొడుకును నీలో పోగొట్టుకున్నాడట. అతన్ని మింగిన దుష్టుణ్ణి తక్షణం చూపించు," అన్నాడు.

వెంటనే సముద్రుడు ప్రత్యక్షమై చేతులు జోడించి, "పంచజను డనే రాక్షసుడు తిమి రూపంలో వచ్చి మీ గురువుగారి కొడుకును మింగేశాడు. ఆ రాక్షసుణ్ణి ఇప్పుడే నీ ముందుంచుతాను," అన్నాడు.

మరుక్షణమే సముద్రపు కెరటాలు తిమి రూపంలో ఉన్న పంచజనుణ్ణి తెచ్చి ఒడ్డున పారేశాయి. కృష్ణుడు కత్తితో దాని పొట్ట చీల్చి చూస్తే దానిలో గురుపుత్రుడు లేడు, కాని ఒక గొప్ప శంఖం ఉన్నది. దాన్ని చూడగానే కృష్ణుడికి ముచ్చట వేసి, తన ఉపయోగం కోసం ఉంచుకున్నాడు. పంచజనుడి కడుపులో దొరికింది గనక ఆ శంఖానికి పాంచజన్య మనే పేరు వచ్చింది.

అయితే గురుపుత్రుడి సమస్య తీరలేదు. ఆ కుర్రవాడు ఏమై ఉంటాడు? చచ్చిపోయి యమలోకానికే పోయి ఉండాలి. ఇలా అనుకుని కృష్ణుడు తిన్నగా దక్షిణ దిక్కుగా బయలుదేరి యమలోకానికి వెళ్ళి, సింహాసనం మీద కూర్చుని ఉన్న యమధర్మ



రాజును చూసి, కోపంగా, "మా గురువుగారైన సాందీపనుడి కొడుకును నువు తీసుకొచ్చావు. అతన్ని నాకు తిరిగి ఇచ్చెయ్యి. ఇవ్వకుండా దౌర్జన్యానికి దిగావో, నీ ప్రాణాలు తీస్తాను," అన్నాడు.

యముడు వొణికిపోతూ లేచి నిలబడి, చేతులు జోడించి, "నేను ప్రాణుల పుణ్యపాపాలు నిర్ణయించే వాణ్ణేగాని, ప్రాణాలు తెచ్చేవాణ్ణి కాను. అది మృత్యువు పని," అని చెప్పాడు.

"మృత్యువు కింత పొగరా? మా గురుపుత్రుణ్ణి తీసుకు పోవటమే గాక, మమ్మల్ని ఇంత దూరం తిప్పిస్తాడా? వాడి ఆయువు మూడింది!" అంటూ కృష్ణుడు వింటికి ఒక దివ్య బాణం ఎక్కుపెట్టాడు. అది చూసి భయపడి మృత్యువు గురుపుత్రుడి ప్రాణాలను తిరిగి శరీరంలో ఉంచి తెచ్చి, కృష్ణుడి ముందుంచాడు.

ఈ విధంగా కృష్ణుడు సముద్రుణ్ణీ, యముణ్ణీ, మృత్యువునూ గడగడ లాడించి, పాంచజన్యాన్నీ, ప్రాణాలతో గురుపుత్రుణ్ణీ సాధించి, తన గురువు దగ్గిరికి తిరిగివచ్చాడు. గురువుగారు ఆశ్చర్యంతోనూ, ఆనందంతోనూ వివశుడై, తన కొడుకుని కౌగలించుకుని, అపూర్వమైన గురుదక్షిణ ఇచ్చినందుకు కృష్ణుణ్ణి వెయ్యివిధాల ఆశీర్వదించాడు. బలరామకృష్ణులు మరికొన్ని రోజులు గురువుగారింట ఉండి, ఆయన వద్ద సెలవు పుచ్చుకుని, మధురానగరానికి తిరిగి వచ్చారు.

వాళ్ళకు ఉగ్రసేనుడు బ్రహ్మాండమైన స్వాగతమూ ఊరేగింపూ ఏర్పాటుచేసి, బంధువులనూ, పరివారాన్నీ వెంటబెట్టుకుని వాళ్ళకు ఎదురువెళ్ళి, మేళతాళాలతో తీసుకొచ్చాడు. బలరామకృష్ణులు వసుదేవుడి ఇంటికి చేరుకుని, తమ విద్యాభ్యాసం అనుభవాలు అందరికీ చెప్పి, సుఖంగా కాలం గడపసాగారు.

జరాసంధుడు మగధదేశానికి రాజు. ఇతని కుమార్తెలు అస్తి, ప్రాప్తి అనేవాళ్ళు కంసుడి భార్యలు. తన అల్లుణ్ణి కృష్ణుడు చంపి, తన కుమార్తెలకు వైధవ్యం కలిగించాడన్న వార్త విని ఆ కోపంతో, జరాసంధుడు, అనేకమంది రాజులను కూడగట్టుకుని, ఇరవైఒక్క అక్షౌహిణీల సేనను వెంటబెట్టుకుని మధుర మీదికి యుద్ధానికి బయలుదేరి వచ్చి, యమునా తీరాన విడిసి, విందుడూ, అనువిందుడూ అనే రాజకుమారులను కృష్ణుడి వద్దకు తన దూతలుగా పంపాడు. వారు ఉగ్రసేనుడి సభకు వచ్చి, ఆ సభలోనే బలరాముడితో సహా కూర్చుని ఉన్న కృష్ణుడితో, జరాసంధుడి మాటలుగా ఇలా చెప్పారు:



"నువ్వూ, నీ అన్నా పెద్ద మొనగాళ్ళలాగా వచ్చి కంసుణ్ణీ, అతని తమ్ముణ్ణీ చంపారు. కంసుడు నా అల్లుడు. నా కుమార్తెల వైధవ్యదుఃఖం చూడలేక, నీతో యుద్ధం చెయ్యటానికి వచ్చాను. నువు త్వరగా యుద్ధానికి రా. నువ్వయినా బతికి ఉండాలి, నేనైనా బతికి ఉండాలి; మన ఇద్దరికీ భూమి మీద చోటు లేదు. ఎదట నిలబడి నాతో యుద్ధం చేశావా నిన్ను చంపేస్తాను; యుద్ధం చెయ్యలేక పారిపోయావా, పాతాళంలో దూరినా వెంట తరిమి హతమార్చుతాను. నే నెలాటివాణ్ణో అక్రూరుణ్ణి అడిగినా, నీ తమ్ముడు సాత్యకిని అడిగినా చెబుతారు. రేపే మధురానగరానికి ముట్టడి వేస్తున్నాను. కనక నువు సిద్ధంగా ఉండు."

జరాసంధుడి మాటలుగా దూతలు చెప్పిన ఈ మాటలు విని కృష్ణుడు నవ్వుతూ, "చాలా సంతోషం. నేను ఇన్ని మాటలవాణ్ణి కాను. జరాసంధుడి కొవ్వు అణచటానికి నేనే వద్దా మనుకుంటుండగా తానే వచ్చాడు. రానీ. పూర్వం రాక్షసి అతికించిన అతని శరీరాన్ని మళ్ళీ రెండుగా

చీలుస్తాను. కంసుణ్ణి చంపి ఈ రాజ్యాన్ని ఉగ్రసేనుడి కిచ్చినట్టే, జరాసంధుణ్ణి చంపి, అతని కొడుక్కు మగధ రాజ్యాభిషేకం చేస్తాను," అన్నాడు.

జరాసంధుడి దూతలుగా వచ్చిన రాజకుమారులు కృష్ణుడి చేత సత్కారాలు పొంది వెళ్ళి, అతను చెప్పిన జవాబు జరాసంధుడికి అందించారు.

జరాసంధుడి పేరు వినగానే ఉగ్రసేనుడు మొదలుగా గల యాదవు లందరికీ కాళ్ళు చల్లబడ్డాయి. వారిలో వికద్రు డనే యదువృద్ధుడు, కృష్ణుడితో ఇలా అన్నాడు:

"నాయనా, కమలంలో బ్రహ్మ పుట్టినట్టుగా ఈ యదువంశంలో నువు పుట్టావు. నువ్వుండగా యాదవుల కే భయమూ ఉండదు. జరాసంధుడికి అంతులేని రాజుల అండ ఉన్నది. అతను యుక్తిపరుడు, దారుణ స్వభావుడు. అతన్ని యుద్ధంలో ఓడించే శక్తి నీ కొక్కడికే ఉన్నది. కంసుడు బలగర్వితుడై కోటకు ఎలాటి రక్షణలూ లేకుండా ఉంచాడు. ఆయుధాలు సిద్ధంగా లేవు, ఆహారపదార్థాలు అంతకన్నా లేవు. నిజాని కిది ఇవాళ దుర్గమే కాదు. అకస్మాత్తుగా శత్రువు వచ్చి పడ్డాడు. అతన్ని ఎదిరించక ఎవరి మానాన వారు చేతులు కట్టుకు కూర్చుంటే ఈ రాష్ట్రం దక్కదు. పూర్వం ముచికుందుడూ, పద్మవంతుడూ, సారసుడూ, హరితుడూ అనే యాదవ రాజులు ఋక్షవంతమూ, వింధ్యమూ, సహ్యమూ అనే పర్వతాలలోనూ, పడమటి సముద్రంలోని దీవులలోనూ శత్రువులకు లొంగని దుర్గా లెన్నో నిర్మించారు. వీరు నలుగురికీ పూర్వమే మాధవుడు ఈ మధురను పాలించాడు. ఈ నాడు దీనిని బలపరచటం సాధ్యం కాదు. వేరే మరొక దుర్గం ఏర్పాటు చేసుకోవలసిందే. సూచనప్రాయంగా చెప్పాను. కర్తవ్యం నువే ఆలోచించు."





# అరణ్యపురాణం

## 15

ఊరి చివర చెట్టు కింద సమావేశమైన జనం యొక్క కోలాహలం అంతకంతకూ హెచ్చిపోతున్నది. అది అట్టహాసంగా పెడబొబ్బలతో ముగిసింది. కర్రలూ, బొంగులూ, కొడవళ్ళూ, కత్తులూ పట్టుకున్న స్త్రీలూ, పురుషులూ, బలదేవ, పూజారీల వెంట వీధివెంబడి బయలుదేరి మెస్సువా వాళ్ళ ఇంటికి వచ్చారు.

గుడిసె తలుపు కొంచెం చిక్కుపెట్టి, తెరుచుకోలేదు. జనం తలుపు పడతన్నారు. కాగడాల వెలుగు గుడిసెలో ప్రసరించింది. మంచం మీద నల్లగా బాఘీర, పంజాలు మంచంపట్టె మీదుగా వేళ్లాడవేసి, పడుకుని ఉండటం కనబడింది. ఒక్క అరనిమిషం పాటు నిశ్శబ్దం. ముందుండిన జనం ప్రాణాల కోసం పెనగులాడుతూ, వెనక ఉన్నవాళ్లను తోసుకుని బయటపడ యత్నించారు. ఈ అరనిమిషం లోపల బాఘీర తలయెత్తి, నోరంతా తెరిచి, తాపీగా, తృప్తిగా ఆవలించాడు.

మరుక్షణం వీధిలో ఒక్క పురుగు లేదు. బాఘీర కిటికీలో నుంచి బయటికి దూకి మౌగ్లీ చెంత నిలబడ్డాడు.

"ఇక తెల్లవారితే గాని వాళ్లు ఇళ్ళనుంచి బయటికి రారు. ఇప్పుడిక ఏమిటి?" అన్నాడు బాఘీర.

"మంచిపని చేశావు. తెల్లవారిన దాకా వాళ్ళను ఒక కంట కనిపెట్టి ఉండు. నేను నిద్రపోవాలి," అని మౌగ్లీ అరణ్యంలోకి పరిగెత్తి, ఒక చట్రాయి పైన పడుకుని గొడ్డు నిద్రలో పడ్డాడు. అతను ఆ రాత్రీ, తరవాత పగలూ అలాగే నిద్రపోయి, తిరిగి రాత్రి అయాక లేచాడు. అతను లేచేసరికి అతని పక్కన బాఘీర ఉన్నాడు.

అట్ట చివరి బొమ్మ



"ఆ మొగుడూ పెళ్ళాలు ఖాన్హివారా కను చూపు మేరలోకి క్షేమంగా చేరారు. తోడే లమ్మ కబురు పంపింది. అర్ధరాత్రి లోపలే వాళ్ళకు గుర్రం దొరికిందిట. ప్రయాణం సుఖంగా సాగిందిట. ఇవాళ బారెడు పొద్దె క్కినదాకా గ్రామంలో ఉండే మనిషిమంద ఇళ్ళు కదల్లేదు," అన్నాడు బాఘీర.

మౌగ్లీ ఏదో ఆలోచనలో పడ్డాడు. చెట్టు కింద బలదేవుడు చెప్పిన కథలలో ఒకటి అతనికి జ్ఞాపకం వచ్చింది. అతను తల ఎత్తి బాఘీరతో, "హాథీనీ, ఆయన ముగ్గురు కొడుకులనూ ఇక్కడి కొకసారి పిలుచు కొస్తావా?" అన్నాడు.



బాఘీర నివ్వెరపోయి, "ఆయన అరణ్యా నికి అధిపతి. మనం రా, పో అనటం భావ్యంగా ఉంటుందా?" అన్నాడు.

"ఒక్క మాట చెవిని వేశావంటే ఆయన తప్పక వస్తాడు. ఆ మాట ఏమిటంటే— భరత్‌పూర్ పొలాల దాడి. ఆ మాట చెప్పి రమ్మను, తప్పక వస్తాడు," అన్నాడు మౌగ్లీ.

బాఘీర, హాథీ ఏనుగునూ, అతని కొడుకు లనూ వెతుక్కుంటూ వెళ్ళాడు. మౌగ్లీ రమ్మన్నాడని చెబితే హాథీకి ఆగ్రహం రావచ్చు, అంతకంటె ఇంకేం జరుగుతుందీ?

మౌగ్లీ రక్తం ఉడికిపోతున్నది. అత నెన్నడూ మనిషిరక్తం వాసన చూసినవాడు కాడు. అలాటివాడు మెస్సువా రక్తం వాసన చూసి చీదరించుకున్నాడు. అతనిలో ప్రేమ భావం అంటూ ఏమైనా ఉంటే మెస్సువా పైన మాత్రమే ఉన్నది. ఆమెను తాళ్ళతో బధించినందుకు మానవుల పైన పగ తీర్చు కోవాలి. అందుకు హాథీ సహాయం అవ సరం. బలదేవుడు చెప్పిన ఒక కథ వల్ల మౌగ్లీకి ఈ ఆలోచన వచ్చింది.

మాటాపలుకూ లేకుండా హాథీ, అతని ముగ్గురు కొడుకులూ మౌగ్లీ ఉన్న చోటికి బాఘీర వెంట వచ్చారు. మౌగ్లీ చాలాసేపు ఏమీ అనక, చివరకు బాఘీర కేసి తిరిగి,

"నీ కొక గొప్ప ఏనుగు కథ చెబుతాను. చాలాకాలం క్రితం భరత్‌పూర్ వేటగాళ్ళు ఈ ఏనుగును ఒక గుంటలో మాటువేసి పట్టుకున్నారు. అప్పుడా ఏనుగు కాళ్ళలో ఒకటి గుంటలో ఉన్న గుంజ మూలంగా చీరుకుపోయి, తెల్లటి చార ఏర్పడింది. తరవాత వేటగాళ్లు అతన్ని గుంటలో నుంచి పైకి తీసుకు పోదామని వచ్చారు. కాని పరాక్రమం గల ఆ ఏనుగు కట్లు తెంచుకుని పారిపోయాడు. ఆయనకు ముగ్గురు కొడుకు లని జ్ఞాపకం," అన్నాడు.

వెన్నెలలో హాథీ అటూ ఇటూ మసిలే టప్పుడు అతని కాలిమీద తెల్లని చార మెరి సింది. మౌగ్లీ హాథీ కేసి తిరిగి, "అ పొలాలు నూర్చే తరుణం వచ్చేటప్పటికి ఏం జరిగింది హాథీ?" అని అడిగాడు.

"నేనూ, నా ముగ్గురు కొడుకులూ వాటిని నూర్చాం," అన్నాడు హాథీ.

"తరవాత పొలాల సాగేమయింది?"

"సాగలేదు."

"ఆ పొలాలమీద బతికే వాళ్లేమయారు?"

"పొలాలు వదిలిపెట్టి పోయారు."

"వాళ్ళ ఇళ్ళు?"

"వాటి కప్పులను మేం పీకేశాం. మట్టి గోడలను అరణ్యం మింగేసింది. అయిదు



గ్రామాలను అరణ్యంలో కలిపేశాం. ఈ భరత్‌పూర్ పొలాల దాడిని నేనూ, నా కొడు కులూ చేశాం. కాని, మనిషికూనా, నీ కీ కథ యింత వివరంగా ఎలా తెలిసింది?" అని హాథీ అడిగాడు.

"ఒక మనిషి చెప్పగా విన్నాను. ఆ దాడి చాలా బాగా జరిగింది. అలాంటి దాడి మరొకటి ఇప్పుడు జరగాలి. నన్ను వెలి వేసిన మనుషుల మంద ఉండే గ్రామం తెలుసు గదా? ఆ గ్రామాన్ని అరణ్యంలో చేర్చాలి, హాథీ!" అన్నాడు మౌగ్లీ.

"అందుకు చాలా ఆగ్రహం కావాలి. నా కా మనిషి మంద మీద ఆగ్రహం లేదే!

ఏం చేసేటట్టు?" అన్నాడు హాథీ అను మానంగా.

"అరణ్యంలో శాకాహారివి నువేనా ఏమిటి? పొలాలు నాశనమయ్యేదాకా నువా చాయలకు పోనవసరం లేదు. నీ వాళ్లయిన లేళ్ళనూ, దుప్పులనూ, పందులనూ అటు కేసి పంపు," అన్నాడు మౌగ్లీ.

హాథీ తన కొడుకులతో వెళ్లిపోయాక బాఘీర భయంతో వణికిపోతూ, "అరణ్య ప్రభూ, అవసరం వచ్చినప్పుడు నన్నూ, భాలూనూ కనిపెట్టి ఉండు. నీ ముందు మేము కూనలం!" అన్నాడు.

ఎలా బయలుదేరిందో గాని అరణ్యంలో ఒక పుకారు బయలుదేరింది—ఫలాని లోయలో మంచి మేతా, శ్రేష్ఠమైన నీరూ ఉన్నదట! అటువంటి పుకారు ఊరికే పోదు. అరణ్యంలో ఎక్కడెక్కడో ఉండే అడివి దున్నలూ, లేళ్ళూ క్రమంగా ఒక దిక్కుగా బయలుదేరి మేస్తూ వెళ్ళాయి. వాటిని సరి అయిన మార్గంలో నడిపిస్తూ, ముందుకు పోయే ప్రోత్సాహం ఇచ్చిన జంతువు లెన్నో ఉన్నాయి. అంతా ఒక పథకం ప్రకారం సాగింది. గ్రామానికి పది మైళ్ళ కైవారంలోకి అసంఖ్యాకమైన అరణ్య మృగాలు మేయటానికి వచ్చాయి.

ఒకనాడు గ్రామస్థులు ఉదయం లేచి చూసేసరికి వాళ్ళ పొలాలు లేవు; వాళ్ళ పశువులకు గడ్డిపరకలు లేవు. ఆ రాత్రి ఏవో క్రూరమృగాలు గ్రామం ప్రవేశించి, అక్కడ ఉన్న నాలుగు పొట్టి గుర్రాలనూ చంపేసి పోయాయి. తరవాత ఏనుగులు రంగంలో ప్రవేశించి, ఇళ్ళ కప్పులు లాగే శాయి, మట్టిగోడలను కూలదోశాయి.

అప్పటికీ గ్రామస్థులు వెళ్లిపోవటానికి తాత్సారం చేశారు. ఇంతలో వానలు వచ్చాయి. గ్రామం ఖాళీ అయింది. ఈ విధంగా ఆ గ్రామంలోకి అరణ్యం ప్రవేశించ టానికి కృషి ముగిసింది.



# 69. మిహ్రిమా మసీదు

ఇస్తాన్‌బుల్ (టర్కీ)లోని కొండలన్నిటిలోకీ ఎత్తయిన దానిపైన నిర్మించిన ఈ అందమైన మసీదులో అనేక గవాక్షాలున్నాయి. దీనిని నిర్మించినవాడు సినాన్ అనే ఆర్మేనియను శిల్పి. మిహ్రిమా అనే ఆమె సొలిమన్ అనేవాడి కుమార్తె. ఆమె ఈ మసీదులో ఉంటే ఆకాశం కింద ఉన్నట్టుండాలన్నదట.



Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

రెండు జతల కళ్ళు

పంపినవారు:
ఎస్. రామకృష్ణ, ఏలూరు

Photo by T. S. Satyan



బహుమతి
పొందిన వ్యాఖ్య

రెండవ జత కాళ్ళు

పంపినవారు:
ఎన్. రామకృష్ణ, ఏలూరు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1967 అక్టోబర్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఆగష్టు నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## ఆగష్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : రెండు జతల కళ్ళు

రెండవ ఫోటో : రెండవ జత కాళ్ళు

పంపినవారు : నిమ్మల రామకృష్ణ,

ఏలూరు.

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# వేరుశనగ కాయ నీకు ప్యారీస్ నాకు

PRS 3844

మీరు ఉపయోగించారా:

లాక్టోబాన్ బాన్స్

మిల్కి టాఫీ

మిక్సెడ్ ఫ్రూట్స్

సూపర్ బట్టర్ స్కాచ్

పంచుకోండి

అనుభవించండి

ప్యారీ మిఠాయిలతో

జీవితము

విలాసవంతంగా

గడిచిపోతుంది




ప్యారీస్—విశిష్ట రకపు మిఠాయిలను తయారుచేయువారు

ప్యారీస్ కన్‌ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాస్



# దిలీప్ బృందం

## వైకుంఠపాళీ ఆట









ఫ్యూజ్

అరే! దీపాలారి పోయాయే!

ఆట మంచి తమాషాగా వున్నప్పుడే ఆరిపోయాయే!

ఉండండి. నా 'ఎవరెడీ' తీసుకొస్తా. ఆట ఆడుకోవచ్చు.






# రుచికరమైన ఆహారమునకు

# తుషార్ వనస్పతి

ఎ, డి విటమినులతో బలపరచబడినది




తుంగభద్ర ఇండస్ట్రీస్ లి. కర్నూలు

ASP/TI/12 TEL




అన్నంలో దింరాను...ఐహాగా
అది పూర్తిగా నా భార్య తప్పు
కాదేమో. నా తప్పు అయివుండ
వచ్చుకూడా...అన్నమానమూ
ఎంతో అలసటగా తప్పిపోయి
వుండే వాణ్ణి.

డాక్టరు సలహా ఎంతో
సహాయపడింది. "హార్లిక్స్
తీసుకోండి. అదనపు
శక్తి పొందడానికి అది
మీకు సహాయపడుతుంది"
అని అన్నాడాయన.



నేనిప్పుడు నిజంగానే ఒక మారిన
మనిషిని. హార్లిక్స్ నాలో యెంత చక్కని
మార్పు కలిగించిందో ప్రతిఒక్కరూ
గుర్తిస్తున్నారు.

# ఎంతో ఆనందం..
# హార్లిక్స్
# వాడిన తరవాత!



అలసట మీకెక్కడున్నా యిబ్బంది కలిగిస్తుంది. మీరు యెక్కువ శక్తి కలిగివుంటే ఎంతో ఆనందంగా వుంటారు. అధిక శక్తికోసం డాక్టర్లు హార్లిక్స్ సిఫార్సు చేస్తారు! హార్లిక్స్ వినియోగమయిన శక్తిని తిరిగి యిచ్చి ఉత్సాహాన్ని యిస్తుంది. త్వరగా సులువుగా జీర్ణమయ్యే సహజ ఆహార పదార్థాలతో ఒక ప్రత్యేక పద్ధతిలో హార్లిక్స్ తయారు చెయ్యబడింది. హార్లిక్స్ మీకు క్రొత్త జీవితం ప్రసాదిస్తుంది!




గోధుమ పిండి మరియు
మాల్టెడ్ బార్లీ పోషకవంతమైన
పాలేకాక మరియు శక్తి

# హార్లిక్స్
ఆదనపు శక్తిని కలిగించును!

# ఇప్పుడే...

# మీ సహాయం అవసరం!

"మన మందరమూ ఒకే జాతికి చెందినవారము. మనమంతా ఒకే ప్రజ. బీహారు, ఉత్తరప్రదేశ్. ఇతర అనావృష్టి ప్రాంతాలలో వచ్చిన ఆపద యావద్భారతదేశానికే వచ్చిన ఆపద. మనమంతా కలిసి అనావృష్టి పరిస్థితుల్ని ఎదుర్కోనాలి. కష్టసుఖాలను మనమంతా కలిసి పంచుకోవాలి. ఉజ్జ్వల భవిష్యత్తుకు మనం ఐక్యంగా కృషి చేయాలి."

**ఇందిరా గాంధి**

ప్రధాన మంత్రి

ప్రధాన మంత్రి కరువు సహాయక నిధికి
ఉదారంగా విరాళ మివ్వండి.

విరాళాలను నగదు రూపంలో కానీ, వస్తు రూపంలో కానీ
ఈ క్రింది చిరునామాకు పంపండి.

ప్రధాన మంత్రి కరువు సహాయక నిధి,
క్యాబినెట్ సెక్రటేరియట్, రాష్ట్రపతి భవన్,
న్యూ ఢిల్లీ - 4.

# TEACH YOUR CHILD THE SAVING HABIT NOW...

WHILE LIFETIME HABITS ARE BEING FORMED.



- Minors above the age of 14 years can open SAVINGS ACCOUNTS.
- Rs. 5/- is all that is required to open an account.
- Even as little as a Rupee can be deposited into the account.
- Withdrawals also can be made.
- **4%** interst on monthly minimum balances.

**For further particulars, please enquire at our branch nearest to you, or write to us.**




## THE ANDHRA BANK LIMITED

**(The Bank For Friendly Service)**

Regd Office: Machilipatnam Centeral Office: Hyderabad (A. P.)

K. S. DUTT
Chairman

T. R. BHAGAVAT
General Manager

# AWARDS!

# WON PLENTY

## YET WE DON'T SAY
## WE ARE THE BEST

## ONLY
## WE DO OUR BEST



**PRASAD PROCESS PRIVATE LTD**

**CHANDAMAMA BUILDINGS MADRAS-26**

